శ్రీ

# మోహినీరుక్మాంగద నాటకము.



ఇది

బళ్ళారిలోనున్న డిస్ట్రిక్టు కోర్టు వకీలు

"ఆంధ్రనాటక పితామహ" యను బిరుదువహించిన


## ధర్మవరము-రామకృష్ణమాచార్యులచేత


రచియింపఁబడి

డి. కె. కృష్ణమాచార్లు, వారిస హోదరులవలనఁ బ్రకటింపఁబడియె.

రెండవ కూర్పు.


బళ్ళారి

భువనేశ్వరీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1931




(క్రయము రూ. 1-0-0

# మోహినీ రుక్మాంగద నాటకము.

——(:o:)——



—: కథా సంగ్రహము :—



## ప్రథమాఙ్కము.

రం. 1. అజామిళుని చరిత్రము నారదునివలన విని రుక్మాంగదుడు ఏకాదశీ వ్రతము పట్టుట.

రం. 2. ఏకాదశీ వ్రతమును గురించిన ముఖ్య ప్రకటన.

రం. 3. పిచ్చిల పలాహకులను నిరువును సత్రధర్మకర్తలు పంచావకేశ శాస్త్రియును మధుర వైపునుండి వచ్చిన యధికారిచే బలవంతపు ఏకాదశి చేయించుట.



## ద్వితీయాఙ్కము.

రం. 1. యముడు విరామముగా వైద్యనాథుడను గంధర్వునితో చదరంగమాడుట. వారిసంభాషణము.

రం. 2. నందనవనములో రంభాదులయిన యప్సరసల సంగీత వినోదము. ఆసందర్భమున నైన విఘ్నములు.

రం. 3. యమ బ్రహ్మల సంవాదము. విష్ణు సేనానియగు విష్వక్సేనుడు వచ్చి వైకుంఠము వృద్ధిచేయుమని చెప్పుట. అప్సరసల మోహము.

## తృతీయాఙ్కము.

రం. 1. రుక్మాంగదునిభార్య సంధ్యావళి గర్భముతోనుండుట. ఇష్టకామేశ ప్రభావమున నాయమ జాడ్యము నివర్తించియుండినందున శివస్తుతి.

రం. 2. అప్సరసల నిర్ధారణము.

రం. 3. రుక్మాంగదు హరికథా కాలక్షేపము. మోహిని యకృత్రిమ మోహము.

## చతుర్థాఙ్కము.

రం. 1. వింధ్యపర్వతములో నిష్టకామేశాలయము. మోహిని గానము రుక్మాంగదు మోహము శివలింగము నుభయులు స్తుతించుట.

రం. 2 రుక్మాంగదు భార్యల యాలోచన. వారి నిర్ధారణము. మోహినీ సంధ్యావళుల స్నేహము.

## పఞ్చమాఙ్కము.

రం. 1. రంభాదుల యాగ్రహము. మోహిని పశ్చాత్తాపము.

రం. 2. రుక్మాంగదు నేకాదశీ నియమువలని దుఃఖము. మోహినీ క్రూరకృత్యము. ధర్మాంగదుని మనోదార్ఢ్యము. శ్రీవిష్ణు నాగమనము. స్తవము.

—: మంగళము.

# పీఠిక.

ఇదివఱకు లోకుల కెఱింగిన రుక్మాంగద చరిత్రమునందలి సంవిధానమునకును దీనికిని జాలవ్యత్యాసము గలదు. సంవిధానమున నీవ్యత్యాసము గల్పించినందులకు గ్రంథకర్తగారే కారణముల నుడివియున్నారు. ప్రప్రథమమున నీనాటకము ప్రదర్శింపఁ బడినప్పు డీక్రింది విధమున నాచార్యులవారే కరపత్రముల యందుఁ బ్రకటించియుండిరి.

సాధారణముగ రుక్మాంగద నాటకమునాడని నాటక సంఘములే లేవు. కథయు జనులకంతయు దెలిసినదే. అయిన నందలి సంవిధానము మాత్రము కొంచెము చింతనీయము. రుక్మాంగదు నేకాదశీ వ్రతప్రభావమున జీవాత్మలు వైకుంఠమునకు పోవను ప్రారంభించి యమలోకమున నరకములు శూన్యములు కాగా యముడు నారదునితో కన్నులకు నీళ్లు పెట్టుకొని యేడ్చినది చాలక బ్రహ్మతో మొరబెట్టుకొని తన యమాధికారమునకు 'రాజీనామా' యిచ్చెదనని గోడు చెప్పుకోగా బ్రహ్మ మిక్కిలి వ్యసనపడి ఈ వ్రతము భంగము చేయుటకు మోహినియను కన్యకను పుట్టించి వ్రతము చెఱిచెనని కథ. ఇదియే పలువిధములుగా నాటకకర్తలా మోదించియున్నారు. నాటక కర్తలకు కథలోని బీజము మాత్రము వదలక స్వారస్యము కొరకు సంవిధానము కొరకు కథను మనసునకు వచ్చినంత మార్చుటకు స్వాతంత్ర్యము కలదు. ఈ కథలో తననరకములకు జీవులు రాకపోయినంతనే కన్నీరు మున్నీరుగా నేడ్వవలసినంత యముని తాత లార్జించినంత గండేమి పోయెనో? యముడు మొత్తుకొన్నంతనే నిష్పక్షపాత సృష్టికర్తయగు బ్రహ్మకు రుక్మాంగదు సద్వ్రతము చెఱుపవలసినంత కార్పణ్యము పుట్టుటకు కారణమేమో—అందుకు ఒక స్త్రీ పుట్టి రుక్మాంగదుని యెడల మోహము లేక మోహించి మోసగించి క్రూరకృత్యముల చేయింప నుద్యమించిన యా నారీతిలక ప్రభావమెట్టిదో యుక్తిశాలురందరును నూహింపవచ్చును. ఈ నాటకమునగల సంవిధానము మార్పున కీక్రిందిపద్యము మాత్రమే చాలును. బ్రహ్మ యమునితో ముచ్చటించును "నీకేమైన కొదవగా నున్నవియా" యని యడుగగా—

సీ. "సతతంబు సంగీతసాహిత్యవిద్యల గారవించుట కవకాశ మబ్బె
నతిశయంబుగ మిత్రతతులతోడ వినోద గోష్ఠి నుండుట కనుకూల మయ్యె
నెమ్మదిఁ గడు భక్తిసంభారమిముఁబోలు పెద్దల దర్శింప వేళ గలిగె
నరుదార రీతిగా హరినామకీర్తనల్ దమిదీఱ సేయంగ సమయ మొదవె

నరసి చూడంగ రుక్మాంగదావనీశు
సలలితైకాదశీవ్రతసత్ఫలంబు
నాకు మోదంబునకుఁ గారణంబు గాక
వారిజాసన! కొదవకుఁ గారణంబె".

మల్లనామాత్యకృత రుక్మాంగద చరిత్రమునందలి మనోహర పద్యములు పెక్కులిందుఁ గైకొనఁబడియున్నవి.



**Bellary· D· KRISHNAMA CHARLU,**

**Andhra Nataka Pithamaha,**

Born 1853—Died 1912.

శ్రీ

# మోహినీరుక్మాంగదనాటకము.



## ప్రథమాఙ్కము-ప్రథమరంగము.



[ప్ర: రుక్మాంగదుఁడు. మన్త్రి బలదేవుఁడు. పండితులు.]

(పండితులు శాస్త్రప్రసంగము చేయుదురు.)

రుక్మా—పండితోత్తములారా! మీశాస్త్రసంవాదము మమ్మెల్లర నానందమగ్నులఁ గావించె. ఇప్పటికిఁ గడుంగడు సంతోషమయ్యె. ఇఁక విరమింపుఁడు. సేవకా! ఈపత్రిక కోశాధ్యక్షునియొద్దకుఁ గొనిపోయి యీపండితోత్తములకు బహుమతు లిప్పింపుము.

(పైనమృదంగధ్వానము, సంగీతరవము, భేరీనిస్వనము వినిపించును.)

రుక్మా—ఆహా! ఏమి యీ మనోహరగీతము! కిన్నరగానమున్నట్టులున్నదే! ఎన్నఁడు వినియెఱుఁగము.

[ప్ర: నారదుఁడు]

రుక్మా—(నారదునకు నమస్కరించి యుచితాసనముపైఁ గూర్చుండఁ జేయును.)

నార—రుక్మాంగద రాజేంద్రా! నీకు సుఖముగలుగుఁగాక?

రుక్మా—మునిశ్రేష్ఠా! మీరాక నన్నెంతయు ధన్యుఁగావించె. కృతార్థుఁడ నైతిని. మునీంద్రా! ఇప్పటికిఁ గొంతసేపటికిముందు నాకాశమార్గమున నెన్నఁడు వినని మనోహరగానము వినిపించె. ఆగాన మెంతయు వర్ణింపవచ్చును. అదియేమి గంధర్వగానమా? కిన్నరగీతమా? నాకానతీయ వేఁడువాఁడ.

నార—ధరణీశా! అయ్యెడనే వచ్చియుండి నినుదర్శించుకొని పోవు కుతూహలమున నిక్కడకు నే నేతెంచితిని. అదియొకచిత్రకథ. కన్యాకుబ్జపురిలోనున్న యజ్ఞమిత్రుఁడను బ్రాహ్మణుని నీవు వినియున్నావుగదా?

రుక్మాం—ఆహా! వినియున్నాను. అతఁడు కులముచెడెననియుఁ ద్రోవలుదోఁచి గుఱు తింపఁబడి శిక్షితుఁడై వచ్చి, మఱల దొంగలలోఁ జేరుకొని చౌర్యముఁ గావించి యధిక హింస యొనర్చుచు నారాజ్యమునకే వచ్చియున్నాఁడని మాయారక్షకుల రొకకు వచ్చియున్నందున నేను నందునకుఁ దగినభంగి రక్షణములొనర్ప నియమించియున్నాను. అది యిప్పుడేల?

నార—అయ్యో! అదియొక పెద్దకథ. అయ్యజామిళునిఁ బోలిన పుణ్యవంతుఁడే కలుగఁడు. అతఁడు మరణముఁ జెందినవేళ యమలోకమునకుఁ గొనిపోవలయునని యముఁడును మాతలును, విష్ణుప్రు, సమకట్టివచ్చి యెట్టకేలకు భార్యతో నతని విష్ణులోకమునకే కొనిపోయిరి. ఆకాలమున సంభవించిన కిన్నరగీతము, గంధర్వగానము, నప్సరో నాట్యమును, దేవదుందుభిధ్వానమును. అవియే నీవువినినవి.

రుక్మాం—ఆహా! ఏమిచిత్రము! ఎంతయో పాపాత్ముఁడని యెంచఁబడు నయ్యజామిళునకు విష్ణులోకప్రాప్తియా? ఇదియెట్లు సంఘటిల్లు! అతఁడొనర్చిన మహా పుణ్యమది యేమి?

నార—ధరాకముకా! అతనిపూర్వజన్మపాపఫలము వలన నతనికి మహాపాపుఁడని దుష్కీర్తి గలిగెఁగాక, యతనిఁబోలిన నిర్మలమానసులు లభించుటరిది. అదిగాక యెట్టి పాపము లెన్నియొనర్చియుండినను, దనయంత్యకాలమందొనర్చిన పుణ్యమువలన సర్వపాపములు కొట్టుపడిపోయె.

రుక్మాం—మునీంద్రా! అదియేమిపుణ్యము?

నార—ఎనలేని పుణ్యకార్యము. మరణపువేళఁ బూర్ణవ్రతంబుగ, నేకాదశీవ్రతము సలిపి ప్రాణోత్క్రమణసమయమున, నారాయణస్మరణ మొనర్చినాఁడు.

రుక్మాం—మునికులతిలకా! నీమాటలవలన నిన్ను మఱల మఱల నడుగవలయునని యెంతయో కుతూహలంబు గలిగెడు. మేమందఱము నేకాదశినాఁ డుపవాసము చేయుచున్నారమే కదా? ఆయజామిళుఁ డొనర్చిన వ్రతవిశేష మేమి? అనుగ్రహించి యానతిమ్ము.

నార—రాజేంద్రా! ఆయేకాదశీవ్రత మాహాత్మ్యమింతని వర్ణింపసాధ్యమా!

సీ. పుణ్యమూర్తులలోనఁ బురుషోత్తముఁడువోలె
గ్రహములలో దివాకరుఁడువోలె
నంభోనిధులలోన నమృతార్ణవమువోలె
నగములలో మేరునగమువోలె

నాశ్రమంబులలో గృహస్థాశ్రమమువోలెc
దరువులలోc గల్పతరువు వోలె
నధిక దానములలో నన్న దానమువోలె
మణులలోc గౌస్తుభమణియుc బోలె

తే. గీ. స్వర్గమున భూమియందు రసాతలమునc
బ్రతి యొనర్పcగ రాని సద్వ్రతము సకల
మంగళాస్పద మఖిలసంపత్కరంబు
క్షితితలేశ్వర! యేకాదశీవ్రతంబు.

అట్టి యేకాదశీవ్రతాచరణమున విధానములు వేఱువేఱుగా నున్నవి. ఏమనcగా

సీ. దశమినాc డేకభుక్తము చేసి మరునాc డ
హోరాత్రములు భక్తి నుపవసించి
హరిమందిరమున జాగర మొప్పc గావించి
వేcగినద్వాదశీవేళయందు
విప్రోత్తములకు షడ్విధరసోపేతంబు
గా భుజింపcగcబెట్టి కనకనిష్క
తతులుదక్షిణలిచ్చి తదనంతరము సుహృ
జ్జనులతో నామిషక్షుద్రశాక

గీ. విరహితంబుగcబారణ వేడ్కcజేసి
నిద్ర దివమెల్లవర్జించి నియమపరత
మాపుభుక్త్యంగనాసంగమములుమాని
యుచితగతినుండుటదియుత్తమోత్తమంబు.

ఇదిసంపూర్ణమగు నేకాదశీవ్రతము. దీనివలన సర్వపాపములునశించు. మహాక్షేత్ర దర్శనపుణ్యము లెన్నియో లభించు.

రుక్మాం—మునీంద్రా! ఈదినమె సుదినము. నీవలన నీపుణ్యకథ నాలింపcగలిగె. అజా మిళుc డేకాదశీవ్రతము నలిపెనంటివే యెన్నిసంవత్సరములు తద్వ్రతవిధానము జరుపుచుండెనె? చోరులతోcగలసి జాతినీతుల నుజ్జగించియున్నవాని కీవ్రతమెట్లు పట్టుపడిరెను? ఇదియంతయు నుల్లాసముగ విను కుతూహలము నాకుc బొడమెడు.

నార—రాజేంద్రా! అయ్యజామిళుఁడు నియమముగా వ్రతము నుపాసించినవాఁడు కాఁడు. వ్రతోద్దేశము నతనికి నుండలేదు. అయిన ఫలముమాత్రము కలకాలము వ్రతము ననుసంధించి జరుపువారికంటె నెక్కువగా లభించినది.

రుక్మా—ఆహా! ఇదేమాశ్చర్యము! నిరుద్దేశముగ నతఁడు వ్రతమెట్లునలిపె? ఫలమెట్లు గలిగె? నిందలిరహస్యము నానతిండు.

నార—రాజచంద్రా! ఇప్పుడు నీరాజ్యము చుట్టుపట్టుననున్న రాజ్యముల బాధించుచు మీకును భయము ముప్పుతిల్లఁజేయు నాఖుమారిజాడ్య మతనికి సోఁకినందున దశమినాఁడు రాత్రియు నేకాదశినాఁ డహోరాత్రములును, నతనికి భోజనము లేదయ్యె. ద్వాదశినాఁ డుదయమునకుముందే హరినామస్మరణ యొనర్చుచు నసువులఁ బాసె. ఇదియే యతఁడొనర్చినవ్రతము.

రుక్మా—మునీంద్రా! ఏమి చిత్రచరిత్రము వచించితివి! జాడ్యమువలన నతఁ డుపవాసమున్నంతనే, వ్రతాచరణఫలము లభించెనను టచ్చెరువుగదా? దీనిరహస్యమెల్ల సవిస్తరముగ వినఁగోరెద.

నార—ధరణీవరా! ఇందు రహస్యమేమున్నది? ఆవ్రతవిధానమేయిట్లు.

సీ. పతికార్యభారసంభ్రమవశంబున నైన
నాఁకలిలేకైన నరుచి నైన
భామినీవిరహసంప్రాప్తినొందుట నైన
నశనమబ్బక యైన నలుక నైన
మృగయావినోద నిమిత్తంబునం దైన
వ్యసనంబునం దైన వనట నైన
దారుణజ్వరపీడ తగలియుండుట నైనఁ
గయ్యంబుకొఱ కైనఁ గఱవు నైన
గీ. నందు హరివాసరమునాఁ డహర్నిశంబు
చాలనుపోష్యపవాసంబు సంభవించె
నేని యాపుణ్యనకుఁగల్లు సిద్ధమై త
నర్చు శ్రీహరివైకుంఠనగరసుఖము.

రుక్మా—ఆహా! యతీంద్రా? నీయనుగ్రహమువలన నాకెంతయు జ్ఞానోదయముగలిగె. నాకును నావ్రతము సమ్మోదయుక్తముగ నాచరించు కుతూహలముపొడమె. ఆ యజామిళుని చరిత్ర మింకను సవిస్తరముగా నాకర్ణించు నుత్సాహమును జనించె.

నార—రాజేంద్రా! ఆ యజామిళ చరిత్రమంతయు సవిస్తరముగ నింకొకసారి వచించెద. ఇప్పటికి వేళయైనది. నీకుమంగళము కానిమ్ము నేనుపోయివత్తును.

రుక్మా—ఉ॥ ధన్యుఁడనైతి మీకృపకుఁ దావలమైతి సమస్త రాజ రా
జన్యులలోన ధర్మగుణ శాశ్వతకీర్తుల నెల్లవారికిన్
మాన్యుఁడనైతి మీరుబహుమానముతో నిటులేగుదేరసా
మాన్యులకిట్టిభాగ్యమహిమల్ సమకూరునెమౌనిచంద్రమా.

క. కారణబాంధవులితరు ల
కారణబాంధవులుమీరు గాన ననున్ శ్రీ
నారాయణపుణ్యవ్రత
పారాయణుఁ జేసితిరి కృపామతులారా.

(నమస్కరించును.)

నార—ఐశ్వర్యమస్తు. [నిష్క్రమించును]

రుక్మా—మంత్రివతంసములారా! కంటిరే యీ నారదమహర్షి యాడిన యేకాదశీ వ్రతమాహాత్మ్యము! భవతారకమై, మోక్షదాయకమై వెలయునట్టి వ్రతరాజ ముండియు, నిర్మలమానసములఁ బూనికతో నిది జరుపలేకయున్నారము. నేఁడే మీరెల్ల నొకనేమనము వ్రాయుఁడు. నారాష్ట్రమునను, నగరగ్రామ జనపదముల కెల్లఁ బంపి యూరూర నీయేకాదశీవ్రత మాచరింపవలయుననిచెప్పి చాటింపఁ బంపుఁడు. ఈవ్రతాచరణమునఁ బ్రకృతిజనులేమైన నశ్రద్ధఁజూపిన వారికిశిక్షగలుగు ననియుఁ జెప్పుఁడు. బలవంతముననైన సన్మార్గాచరణము కలుగఁజేయుట విహితము కావున వైకుంఠనగరలాభమున నా యాదివిష్ణు పాదపంకజములయొద్ద నుండు స్వాతంత్ర్యము కల్గించు నేతద్వ్రతాచరము బలవంతముననైన నెలకొల్పవలయు. ఎల్లవారికిని మొదటనొక్కింత కష్టము గానుండినను, నభ్యాసవశమున నీమార్గము సంతోషమున నవలంబింతురు.

మంత్రి—భాగ్యము. రాజరాజా! ఇప్పుడే యన్నియూళ్లకును భవన్నియోగముఁ బంపెద.

(నిష్క్రమింతురు.)

* * *

## ప్రథమాఙ్కము-ద్వితీయరంగము.

### వీధి.

[ప్ర; రాజసేవకుఁడు (బండిపై నగారవాయించుచు నొకభటునితో) కాగితము చేపట్టి.]

సేవక—ఇదిగో! జనులారా! రుక్మాంగద మహారాజుసభకు ననుగ్రహించి విచ్చేసి యున్న మహాత్ములగు నారదఋషివర్యులు వ్రతములలో నెల్లఁ బ్రతిలేని దైయేకాదశీ వ్రతము రాజిల్లుచనియు సదివిష్ణులోకనిశ్రేణియనియు మోక్షసౌఖ్యపేటికయనియు భవసన్నిపాతబ్రహ్మాస్త్ర మనియుఁ బెక్కువిధముల శ్లాఘించియున్నందున రాజు గారుయోచించి సర్వజనులకు క్షేమమును నాముష్మిక సత్ఫలమును నొదవుటకై తా మొక్కరే కాక తమరాష్ట్రమునఁ జేరిన యెల్లజనులు తద్వ్రత సంపూర్ణాచరణము పాటింపవలయునని యాజ్ఞయిచ్చియున్నారు. ఎల్లవారును జాతుర్భక్తవర్జితముగా నేకాదశీవ్రతము సల్పవలయు. దశమినాఁ డభ్యంజనముచేసుకొని రాత్రిభోజనము మాని యేకాదశి శుద్ధోపవాసము చేసి రాత్రియంతయు శ్రీహరినిలయమున జాగర మొనర్చి ద్వాదశినాఁ డుదయముననే పారణ మొనర్చి యారాత్రి మఱల భోజనమును స్త్రీపురుషసంగమును మాని వ్రతాచరణ మొనర్పవలయునట్లును నిందులకుఁ దప్పినవారు శిక్షార్హులగునట్లును, రాజుగారు గట్టికట్టడ మొనర్చియున్నారు. తమ రాష్ట్రజనులు విధేయులై పరమరాజ భక్తిపరులైయున్న కారణమున శిక్షవలని యేభయములేకయే మనఃపూర్తిగ భక్తిమై తమయాజ్ఞ నెరవేర్తురని రాజుగారు మిక్కిలి విశ్వసించియున్నను విధికొఱకై యాశిక్షమాట వచింపఁబడియున్నది.

సీ. అభ్యంజనస్నానమాచరించి దశమి
నిలనొక్కపొద్దుండవలయుసుండి
హరివాసరము నిరాహారులై జాగర
మెలమిమై నిశిఁజేయవలయుసుండి
ద్వాదశి విప్రసంతర్పణం బొనరించి
యెలమిపారణ సేయవలయుసుండి
తద్దివం బెల్లనిద్రయు రాత్రినన్నంబు
వర్జించి యుండఁగావలయుసుండి

౧. అందఱికిదేవిధంబు రాజాజ్ఞనుండి
నవ్యకైవల్యఫలసాధనంబునుండి
తప్పఁగారాదు తప్పినఁ దప్పు నుండి
అవినారాయణునకుప్రియంబునుండి.
(నగారవాయించుచు నిష్క్రమించును).

(యవనిక దిగఁజాఱును).

———(:o:)———

ప్రథమాఙ్కము-తృతీయరంగము.

సత్రము. [సత్రము కావలివారిరువురుందురు]
[ప్ర: పిచ్ఛిలుఁడు, వలాహకుఁడు.]

పిచ్ఛిల—వలాహకా! ఈరాత్రి కేశవాలయమున గంగావతరణ కథ కాలక్షేపమఁట. వినలేదా? శోభనాచార్యు లనుభాగవతుఁడు మాళవమునుండి వచ్చియున్నాఁడఁట. మిక్కిలి గొప్పవాఁడఁట!

వలాహ—పిచ్ఛిలా! నేనటు వినలేదే. మురధంజనోపాఖ్యానము కాలక్షేపముచేయుదు రని వింటినే.

పిచ్ఛిల—అదియెక్కడ?

వలాహ—కేశవాలయమునందో లేకపద్మనాభదేవాలయమునందో చక్కఁగాఁ దెలియదు

[ప్ర: పథశ్రాంతియైన పంచాపకేశుఁడను నధికారి-చంటిబిడ్డతో నతనిభార్య కుముదాంబ-జలంధరుఁ డను సేవకుఁడు]

అందఱు—(సత్రమున వాయాసమున వచ్చి కూరుచుందురు).

పిచ్ఛిల—అయ్యా! మీరెవరు?

పంచా—ఇదిసత్రమేకదా?

పిచ్ఛిల—ఆహా! ధర్మసత్రమే. మీరెక్కడనుండి వచ్చినారు? ఎక్కడకుఁ బోవు చున్నారు?

పంచా—అయ్యా! మాది బహుదూరదేశము. దక్షిణ మధురవైపున నుండువారము. కాశీయాత్రకై వచ్చియున్నారము.

పిచ్చిల-సంతోషము. ఆప్రక్కనరెండుగదులున్నవి. అక్కడమీవస్తువులుంచుకొనుఁడు.

(బిడ్డయేడ్చును.)

పంచా—అయ్యా! ఇక్కడ బిడ్డకుఁ బాలెక్కడనైనఁ జిక్కునా?

పిచ్చిల—అయ్యో! ఈనాఁ డామాటాడకుము.

పంచా—అదియేమి! ఈయూరఁబాలు దొరకవా?

పిచ్చిల—తృణజలసమృద్ధి గలిగి యమోఘ గోధనముచే రాజిల్లుచున్న యీరాజ్యమునఁ బాలకేమి తక్కువ? ఈసత్రముననే బాటసారుల యుపయోగముకొఱకు నిఱువది పాఁడియావులుగలవు.

పంచా—అట్లయిన పాలు లేవంటివేల?

పిచ్చిల—పాలు లేవని యెవరుచెప్పిరి? ఈనాఁడు పాలిఁబడవనియంటిని.

పంచా—అదియేమి?

పిచ్చిల—ఈనాఁడేకాదశియగుట తెలియదా?

పంచా—ఏకాదశియైన?

పిచ్చిల—అట్లడిగెదవేమి? చిన్నబిడ్డలు మొదలుకొని యేకాదశినిరాహారమే చేయవలయును.

పంచా—ఇదియేమి యసాధ్యము? ప్రణతార్తిహరా! యీవస్తువులన్నియు నాగదిలో నుంచి యూరిలోనికిఁబోయి యెంతైన నిన్నిపాలు తీసికొనిరమ్ము.

ప్రణ—చిత్తము. (అని పిచ్చిలుతో) అయ్యా! వీరు మధురలో న్యాయాధికారి. పంచాపకేశశాస్త్రి యనిపేరు. గొప్పయింటితనము. భార్యతో బిడ్డతో వచ్చియున్నారు. నెలకు రెండువేలనిష్కములు వేతనము. ఎక్కడనైన నిన్నిపాలు తెప్పించియిమ్ము. రొక్కము కావలసియున్న నిచ్చెదను.

పిచ్చి—నీకేమిపిచ్చిపట్టెను? సర్వజనులు నేకాదశి చేయవలయునని రాజాజ్ఞయై యున్నది. రాజునాజ్ఞ యట్లుండఁగా దైవమునాజ్ఞయు మాకట్టిదియేయగు. నీవు రొక్కమిచ్చినను నేమిచ్చినను పాలేకాదు వంటకుఁ బదార్థములైనను నేఁడు చిక్కవు. (బాలుఁడేడ్చును.)

పంచా—ఏడవకు నాయనా! యేడువకు సప్తఋషీ! సప్తఋషీ (అనియూఱార్చును) [పిచ్చిలునితో) ఇదియేమన్యాయమయ్యా! యీయూరిలో బిడ్డకుఁ బాలివ్వరన్న బిడ్డలుచచ్చిపోవరా?

పిచ్చిల—అయ్యో! శాస్త్రిగారూ! ఇంతేనా మీధర్మశ్రవణము. ఒకనాఁటి కూడు లేమికే మృతిఁ జెందఁగలరా! మృతిఁజెందెఁబో యేకాదశీమరణము. అది లభించుట కెంత పుణ్యముండవలయు.

పంచా—ఛీ! యేమిమాటాడెదవు? ఆమాటనకుము. ప్రణతార్తిహరా! లెమ్ము పోయి రమ్ము. కావలసిన పదార్థములన్నియుఁ దీసికొనిరమ్ము వంటచేసికొందము.

పిచ్ఛిల—నీవుచెప్పువాఁడేమి బుద్ధిలేనివాఁడా? ఒక్కపదార్థమునీ కీయూరిలో నీవాఁడు దొరకదు. కొంచెము నాలుగుగడియలు ప్రాణము బిగఁబట్టుకొనుఁడు. తెల్లవాఱియు వాఱకముందే యమూల్యభక్ష్యములతో వంటకాఁగలదు. మీరు వలదన్నను విడువక పిలుచుకొనిపోయి యారగింపఁ బెట్టెదరు ఒక్కనాఁటికే ప్రాణము పోవునా?

పంచా—అయ్యా! ఈయుపదేశము నిన్నేమియు నడుగలేదు. పోవరా! ప్రణతార్తిహరా! (ప్రణతార్తిహరుఁడు నిష్క్ర).

పంచా—అయ్యా! ఆమూల వంటచేసుకొనవచ్చునా?

పిచ్ఛిల—నీగదులలోనే వంటశాలగలదు. వండుకొనుఁడు. రాత్రి కేశవాలయమున నద్భుతరీతిగా హరికథ జరుగఁగలదు. మహోత్సవమున జాగరమొనర్పవచ్చును తెల్లవాఱకముందే మీరు వంటచేసుకొన నెంచిన సర్వపదార్థముల నిచ్చెదము. సంతర్పణకువచ్చితిరా యిఁకను మేలే.

పంచా—అయ్యా! ఇంకఁజాలును. మాకు మీయేకాదశియేవలదు. మీపదార్థములును వలదు. మీపుణ్యమును వలదు. మీయుపచారమును వలదు.

పిచ్ఛిల—అయిన మీయిష్టము.

[పునఃప్రవేశము ప్రణతార్తిహరుఁడు]

ప్రణ—అయ్యా! ఇదిపాడూరు. అంగళ్ళలోఁ గావలసిన పదార్థములున్నవి. ఈవాఁ డేకాదశియని క్రయమున కీయరు. గొల్లవాండ్రు పాలు కుండలకు నించియున్నారు. రొక్కమునకైన, నుపకారమునకైన ఉప్పు తెల్లవాఱుటవఱకు నివ్వరు. వీరల నేమి పుణ్యాత్ములనవలయునో, పాపాత్ములనవలయునో, తెలియదు.

పంచా—అయ్యా! మీయూరివాండ్రు బహుపుణ్యాత్ములుగా నున్నట్టున్నారే? మీరాజెవఁడు?

పిచ్ఛిల—మాయూరు విదిశారాజ్యమునకుఁ జేరియున్నది. అధిక ధర్మాత్ముఁడై సముచిత దైవభక్తిపరుఁడయి యలఘులీల నేకాదశీవ్రతము పాలించుచు మమ్మెల్లరఁ గృతార్థులఁ జేయుచున్న రుక్మాంగదుఁడు మాకధీశుఁడు.

పంచా—(స్వ) సరియే! మంచియధీశుఁడే! (ప్ర) ప్రణతార్తిహరా! అక్కడ సరస్సున్నట్టున్నది. పోయి స్నానమొనర్చి యాకడవతో నీరుగొనిరమ్ము.

(ప్రణతార్తిహరుఁడు నిష్క్రమించును).

కుముదా! యీబాలుని నెత్తికొనిపోయి యాడింపుము. మనయొద్దయున్న పాలపొడినైన నింతకాఁచి పాలుగానొనర్పుము.

[పునః ప్రవేశము ప్రణతార్తిహరుఁడు.]

ప్రణ—ఏమన్యాయముకొంప! ఆసరస్సునొద్ద నొకకావలివాఁడున్నాఁడు. కడవ ముంచి తేనియ్యఁడు. కావలసినన్ని నీళ్లు తీసుకొని గట్టున స్నానము మాత్రముచేసి వినియోగముచేసి పోవలయుఁగాని కడవలో నీరుముంచుకొని పోనివ్వనని నిర్బంధ పెట్టుచున్నాఁడు

పంచా—(పిచ్చిలునితో) ఇదేమన్యాయమయ్యా! మీయూరిలో నీరు తీసుకొననివ్వరఁట?

పిచ్చిల—ఎన్నిమాఁరులు చెప్పవలయునయ్యా! ఒక్కటే కథగదా? ఏకాదశినాఁడు పగటివేళ నీకు నీరెందులకయ్యా? తెల్లవాఱిఁ జేయవలసినవఁటకు రాత్రిజాము ప్రొద్దుమీఱిన పిదపఁ గావలసిన నన్ని నీళ్లు తెచ్చుకొనవచ్చును. అభ్యంతరముండదు. కావలసియున్న నాచమనమునకని చిన్న పంచపాత్రతో నీరు తెచ్చుకొనవచ్చును.

పంచా—అచిన్న పంచపాత్రనైన నీరు తేరా! ప్రణతార్తిహరా! కొంచెము కాఁచుకొందము.

పిచ్చిల—ఎట్లు కాఁచుకొందురు?

పంచా—ఏల? కాఁచుకొనుటకుఁ గట్టెలైనఁ జిక్కవా?

పిచ్చిల—ఈవాఁ డర్ధరాత్రియైన పిదపనే యంగళ్లలోఁ గట్టెలైనఁ జిక్కుట.

పంచా—ఏమయ్యా! యీసత్రములో కొండ వేసినట్లు వేసియున్నారే వంటచెఱకులు. అవి రెండివ్వఁగాదా?

పిచ్చిల—అర్ధరాత్రము మీఱుటవఱకు వాని నిచ్చుటకు మాకాజ్ఞలేదు.

కుముద—నాథా! బాలుని యేడ్పు నిలుపుటకు సాధ్యమేలేదు. ఈపాడుకొంపలో నేల? ఎంతశ్రమమైనఁగాని బండిగట్టుకొని ముందూరికైనను బోవుదము.

పిచ్చిల—కావచ్చును. అయిన నీ నిర్బంధములు తప్పవలయునన్నఁ దూర్పు ముప్పది యామడలు, పశ్చిమమున ముప్పదియాఱామడలు, నుత్తరమున నిరువదిరెండామడలు మాత్రము పోవలసియుండును. అంతవఱకు విదిశానాథుని రాజ్యమే.

పంచా—హా! దైవమా! దేవీ! ఇంకేమిచేయవలయు? బలవన్మాఘస్నానములని విని వెలుఁగుదుముగదా? అట్లనేయిదియు బలవంతపుటేకాదశీవ్రత మనుకొందము.

(లోపల భేరీధ్వని).

పిచ్చిల—అయ్యా! తప్పదు లెండు, స్నానభేరి మ్రోఁగుచున్నది. ఏఁటికిఁబోయి స్నానముచేసి వత్తము. (నిష్క్రమింతురు).

—: ప్రథమాఙ్కము సమాప్తము. :—



శ్రీ

# మోహినీరుక్మాంగదనాటకము.



## ద్వితీయాఙ్కము-ప్రథమరంగము.



### సంయమపురి.

(ప్ర: యముఁడు. వైద్యనాథుఁడనుగంధర్వుఁడును. (చదరంగమాడుచు)

వైద్య—ఓడితినిఁకఁజాలను. ధర్మరాజా! ఇప్పుడిప్పుడుకదా కొన్ని సంవత్సరముల నుండి నీ కవకాశముదొరకుట? ఇంతకుఁ బూర్వమీయాటలకై యొక్కింతైన నీకుఁ గాలముండదే? ఇట్టుండియు నింత స్వల్పకాలమున నెట్టిశక్తి యార్జించితివి!

యమ—వైద్యనాథా! ఇందులకింత ప్రశంసవలయునా! నీ పాండిత్యమునెదుట నాప్రతిభయెంత? చూచితివా! ఇన్ని దినములు నాకుఁ బొద్దుచాలదేయని యేకఱుచుంటి. ఇప్పుడు పొద్దుపోవదేయని వేసరుచున్నాను.

వైద్య—ఏమి! ఒక్కరైన నీపీటికి రారా యిప్పుడు?

యమ—ఎప్పుడో యొకప్పుడువచ్చుచుందురుగాని, నాకవకాశముగలుగుటయే మెందు.

వైద్య—అయిన నాకింక సెలవా? మఱల నెప్పుడు రావలయును.

యమ—పొద్దింతయు నీ విందేయున్న సంతసింతును.

వైద్య—ధర్మరాజా! అవశ్య మాడవచ్చును కాని, నాకించుక పనియుండుటంజేసి విధిలేకయున్నది.

యమ—చాలదినములయ్యె నీమిత్రుఁడగు చిత్రకేతుని పాటవినక. అతని నింత బంపఁగలవా?

వైద్య—చెప్పఁగలను కాని వచ్చునను నమ్మకము మాత్రము నాకుఁగలుగదు. దినమును, రుక్మాంగదు నేకాదశీ ప్రభావమున, భూమిని నిలిచిన ప్రాణులు వైకుంఠలోకమున కరుగునప్పుడు గంధర్వులు-కిన్నరులు-కింపురుషులు పాడుచు, నప్సరస్త్రీ లాడుచు, దేవదుందుభి ధ్వాన మొనర్పవలయునని తప్పని పద్ధతిగానున్నది. కావున నిందఱు గంధర్వులుండియు నొక్కరికైన రెండు గడియలైన నవకాశ మొదవకున్నది. ఎందైనఁబోయి వేడుకగాఁ గాలము గడపవలయునని కూర్చుండిరా వెంటనే సేవకులు పిలువ వత్తురు.

యమ—అట్లనా! ఇదియే మసాన్య ప్రక్రియగానున్నది! పోనీ! దేవేంద్రుఁ డప్పుడప్పుడు నడపుచుండిన యప్సరోవధూమణులనాట్యములకు నన్నుఁ బిలిపించుచుండె. నాకవకాశ మేమాత్రమును జాలక యొక్కనాఁడైనఁబోవఁజాలకుంటి. ఇప్పుడెంతయో యవకాశము గలదుగదా? పోవలయునన్న, నాట్యములే లేకుండ నయ్యె. ఒక్కమాట నీ విట్లయినఁ జేసి దేవనాథునికిఁ జెప్పి రెండుగడియ లెవ్వరికైన నచ్చరులఁ బంపమునఁగలవా? కావలసియున్న లేఖవ్రాసి యిత్తురు

చైత్య—ఎట్లయిన విశ్వప్రయత్న మొనరించి యొకరికైన గంధర్వుని బంపఁగలను గాని, యచ్చరుల మాట విడిచిపెట్టుము. గంధర్వులసంఖ్య మిక్కిలియగుటచే నది యెట్లయిన సాధ్యమగు. అచ్చరలన్న నో యల్పసంఖ్యాకలు. క్షణక్షణమును వారికిఁ బిలుపుదగిలి యొక్కరికైన నవకాశము లేమిచే నెంతయుఁ బరితపించుచున్నారు. వారిలోన నే వారొక్కరికొక్కరు మాటలాడవలయునన్న, నాజీవ వైకుంఠప్రయాణోత్సవకాలమునఁ గాక, వేఱుకాలమున వారి యునికిపట్టుల నవకాశమే లేదు. తమ్ము ననిమేషలనుగా నిద్ర లేకుండ బ్రహ్మ సృజించినందులకు వారు పడుసంకటమింతయని చెప్పఁజాలను. మఱచితి. నిన్న బ్రహ్మలోకమునకుఁ బోయెదనని చెప్పియుంటివే? అందలి విశేషము లేమియుఁ జెప్పవైతివి.

యమ—నేఁ బోవలయునని వెడలి యొక్కింత దూరము పోవఁగా దేవగురుఁడగుబృహస్పతి దర్శనము నాకులభించె. అతనితో ధర్మశాస్త్ర విచారమునకుఁ బూనుకొని సంభాషించుచుండఁ బ్రొద్దుపోయినందున విరించి దర్శనము కాలేదు, రేపు మరల పోవలయునని యున్నాను.

చైద్య—శమనా! నిరంతము జీవవిచారమున నున్న నీకు నిపుడించుకైన పనిలేకుండుట విచారమునకుఁ గారణముగా నున్నదా లేక సంతకమునకుఁగారణముగానున్నదా?

సీ. అసిపత్రవనములయందుఁ ద్రోయఁగలేదె
విలపింపఁ గన్యకావిక్రయులను
దారుయంత్రములనంతటఁ ద్రిప్పఁగాలేదె
దారుణక్రియ గురుతల్పగులను
కూటశాల్మలులందుఁ గుదియఁగొట్టఁగలేదె
పాడిఁదప్పినధరాపాలకులను
గాలసూత్రములందు గడియనొంపఁగలేదె
ఘనశక్తి విశ్వాసఘాతకులను

తే. గీ. వహ్నికుండములం బడవైవలేదె
తల్లడం బందఁగా గృహదాహకులను
బెబ్బులులచేతఁ బడిఁ గఱపింపలేదె
గరళమన్నములోఁ నిడు కష్టమతుల.

యమ — గంధర్వోత్తమా! నీతో నిదివఱకే చెప్పియుండలేదా? మొదట కొన్ని దినములుమాత్ర మీపని లేనియునికి మహావిచారమునకుఁ గారణమయ్యె. ఎందఱు జీవులనో, యెన్ని నరకములనో, చెప్పరాని బాధల వారి పాపానుగుణముగాఁ బెట్టుచుండిన నాకు నేమియుఁ బనిలేక యూరక నీఁగలఁ దోలుకొనుచుఁ గూర్చుండియుండవలయునన్నఁ బెన్నిధానము పోయినట్లు చింతకుఁ గారణముగానుండె. తర్వాతఁ గొన్నిదినములకు నాకార్యహీనత యెనలేని సంతోష మొదవించునట్లయ్యె. నే నదివఱకొనర్చుచుండిన హింసాకార్యముల నేవగించుట కాస్పదమయ్యె. అభ్యాస వశమున నేదియు సిద్ధింగదా?

వైద్య — సందేహమేమి?

యమ — అదిగాక యిన్నిదినములు బ్రహ్మదర్శనముగాని, దిక్పాలమిత్రదర్శనముగాని, నాకులభింపవలయునన్నఁ గష్టసాధ్యముగనుండె. ఇప్పుడెన్ని మారులు దర్శనము చేసికొనవలయునన్నను నెంతకాలము సంభాషణచేఁ గడపవలయునన్నను, నభ్యంతరము లేదు. ఇది మిక్కిలి మోదకారిగదా?

అనుబంధము 1.

వైద్య — ఔను.

యమ — కానిమ్ము. పొమ్ము రేపు మఱలఁ గలయుదము. (నిష్క్రా.)



## ద్వితీయాఙ్కము ద్వితీయరంగము.

### ఇంద్రపురిలో

[ప్ర: రంభ-మేనక-తిలోత్తమ-హారిణి-మోహిని-ఊర్వశి హేమ-పరూధిని.]

రంభ—ఊర్వశీ! నిన్న సురగురుఁడు రచించి ప్రకటించియున్న గీతమిదివరకు మేము విన్నదానికంటె మిక్కిలిమనోహరముగానుండలేదా? అది నేర్చుకొనుటకే మిక్కిలి కష్టముగానున్నదే. నాకింకను బట్టువడలేదు. నీవేమైన గ్రహించితివా?

ఊర్వశి—ఏమో యొకవిధముగ గ్రహించియున్నాను గాని యింకను నామార్గము ఋజుమార్గముగా నుండినట్టు కనపడలేదు.

రంభ—ఏదీ! ఇంతాలకింతము.

ఊర్వ—(ప్రయత్నముచేసి) లేదే! ఇకను క్రమముగా రాలేదు. రేపటికి నేర్వ వచ్చును.

హేమ—అక్కలారా! మన మోహిని యప్పుడే గుణుగుణించినట్టున్నది. నేఁడుదయమునందే మనోహరముగఁ బాడుచుపచ్చె.

రంభ—అట్లనా! అట్లయిన నీ మోహిని సమర్థురాలే. ఏదీ మోహినీ! నీకా సురగురు గీతము పట్టువడియున్న నింత వినదము.

మోహి—నాకు నింకను జక్కఁగఁ బట్టువడలేదు.

హేమ—నేఁడుదయమున పన్నట్టు కానిమ్మా చాలును.

మోహి— అనుబంధము 2.

అందఱు—(కరతాళధ్వనులు చేయుదురు).

ఊర్వ—సెబాసు. మోహినీ! నీవు గాన విద్యావిశారద వయ్యెదవు. ఇన్నిదినముల నుండి విద్యావిశారదలని ఖ్యాతిగన్న మాకెవ్వరికిఁగాని రానిమాదిరి నీ వచిరకాలమునవే గ్రహించితివి. ఏదీ! ఇంకొకసారి పాడుము.

మోహి—(పాడును).

హేమ—ఊర్వశీ! ఇదియే యెంతో యందముగానున్నదిగదా? నిన్నరాత్రిఁ గచుఁడు రచియించిన గీతము దీనికంటె శ్లాఘ్యమని నాకుఁ దోఁచుచున్నది.

ఊర్వ—ఏదీ! వినలేదే.

హేమ—మోహినీ! దానినింత వింతము చెప్పుము.

ఊర్వ—నిన్నరాత్రి యతఁడు రచించియుఁ రచింపకముందే యీమోహినిగ్రహించెనా? అట్లయిన నీకుఁ గొన్ని నాళ్ళలో రంభనుగాని, మేనకనుగాని, నన్నుగాని తిలోత్తమనుగాని పాటించువారే లేకపోవుదురుగదా? (అని చిఱునవ్వుచూపును)

మోహి—అక్కా! సముద్రములయెదుటఁగాలువలన్నట్టు సమంచిత ఖ్యాతిన మీతలగు మీయెదుట నేనొక పదార్థమా?

ఊర్వ—మోహినీ! నేను వేడుకకుఁ బ్రశంసాపూర్వకముగ మాటలాడితిఁగాక, యసూయచే నన్న దానను గాను. ఏది! కచుగీత మింత వినిపింపుము.

[ప్ర: శీఘ్రగమనమున దేవసేవకుఁడు.]

దేవసేవ—రంభాదులారా! మీరందఱిందుఁ జేరియున్నారా? ఇదియేమన్యాయము! అదె వైకుంఠలోకమునకుఁ బోవు జీవాత్మలు నిలిచియున్నారు. వెడలిరండు.

రంభ—ప్రారంభమాయెనా! హరిణీ! నీవుపొమ్ము, ఒక్కింతసేపు.

హరిణి—(స్వ) గానము వినుటకులేదే. ఈపాడు జీవాత్మలెక్కడనుండి వచ్చిరి.

దేవసేవక—వెడలివచ్చెదరా— దేవేంద్రునితోఁ జెప్పవలయునా?

హరిణి—అయ్యా! వచ్చితిని కోపగింపవలదు. (దేవసేవకునితో నిష్క్ర)

మోహి— అనుబంధము 3 (పల్లవిమాత్రము పాడును).

[ప్ర: 2వ సేవకుఁడు]

2వ దేవసేవ—ఇంకరెండు. ఇక్కడ నేల కూర్చుండితిరి. దక్షిణము వైపునుండి జీవాత్మల యుత్సవము వెడలినది. వైకుంఠము వఱకు విడిచి రండు. రెండు. రెండు.

రంభ—వరూధినీ! ఎన్నాళ్ళీ యాగ్రహచారము మనకు?

(2వ సేవకునితో నిష్క్రమింతురు).

ఊర్వ—మోహినీ! ఈకచుగీతము బహుమనోహరముగానున్నది. ముగింపుము.

మోహి— అనుబంధము 3 (ఒక చరణముపాడును.)

[పునః ప్రవేశము 3వ సేవకుఁడు.]

3వ సేవ—రెండు. పడమటి వైపువారువచ్చుచున్నారు. ఇక్కడఁగూర్చుండినఁజరుగదు.

హేమ—నేను పోయివత్తును. (దేవసేవకునితో నిష్క్ర)

మోహి—ఇంకమనము వెడలవలయు.

రంభ—దినదినము నిదేగోడయ్యానే మనకు. ఇదివఱకెవ్వరనలన్న వారినాట్యముతో నెన్నఁడో యొకనాఁడు పనిపడుట. ఇప్పుడు తెల్లవాఱినదిమొదలు విరామము లేకుండ పనియున్నదే? ఎన్నిదినము లిట్లుండఁగలదు?

ఊర్వ—ఈ యేకాదశివ్రతము లోకమున జరిగినన్నాళ్లు నిదేగతియే యుండఁగలను.

తిలో—నాకుఁజూడ రుక్మాంగదుఁడు చచ్చువఱకు మనకీ గ్రహచారముండవచ్చు ననియే తోఁచుచున్నది. అతని జీవమును వైకుంఠమునకుఁ జేర్చినపిదప మన యప్సరల నాట్యముతో నంతపనియుండదు.

రంభ—ఇదేటిమాట! రుక్మాంగదుఁడు పోయినంతనే యతఁడిన్నిదినములు బహు ప్రయాసమున స్థాపించిన యేకాదశీవ్రత మెట్లడఁగును? ఇంక మనకుఁ గొనవఱకునింతే.

[ ప్ర: 4వ దేవసేవకుఁడు]

4వ దేవసే—వెడలిరండు. ఉత్తరమువైపు వారువచ్చుచున్నారు.

రంభ—అహా! యేమిదిది.

మోహిని—నేఁటోయెద.

మేనక—మోహినీ! ఎలదు. ఆగీతము ముగించి పోవుదము.

తిలో—ఔను మోహినీ! పాడుము.

4వ దేవసేవ—మంచిమాటాయె. మీపాటలు-మీ వేడుకలు-మీవినోదములు! మీరు లేకున్న నక్కడ పనులెట్లు జరుగవలయు? అందఱు నిరీక్షించుచున్నారే?

తిలో—వడియుండని యొకగడియ!

4వ దేవసేవ—ఆగడియలో ఇంకెందఱో మా—రాఁగలరో లెండు లెండు.

తిలో—రంభాదులారా! ఆగీతము నేను పిదప వినఁగలను. నేఁటోయెద. మీరువినుఁడు.

[ ప్ర: 2వ సేవకుఁడు]

2వ దేవసేవ—ఏమిరా? ఇక్కడవచ్చి వీరితో సరసములాడుచున్నావే. అక్కడ నుత్తరమువైపున గంధర్వాదు లెల్ల నిరీక్షించి—

4వ దేవసేవ—అదియే వీరితోఁ జెప్పుచున్నాను. వీరలు తెలివిలేక పాటలుపాడుకొను చున్నారు. తిలోత్తమా! రమ్ము.

(తిలోత్తమ 2వ దేవసేవకునితో నిష్క్రమించును).

రంభ—ఇంకనొక క్షణములో మనవంతురాఁగలదు. మోహినీ! కానిమ్ము.

మోహిని— అనుబంధము 3 పాడును.

4వ దేవసేవ—బళీ! బళీ! (అని మెచ్చును).

(మోహిని పాట ముగించియు ముగింపకమునుపే)

[పునః ప్ర: శీఘ్రమున 3వ దేవసేవకుఁడు.]

3వ దేవసేవ—(నాల్గవ దేవసేవకునితో) ఓహో! వారిపాటలు వినితలయూఁచి మెచ్చుకొనుటకా నీవిందు వచ్చినది? అచ్చరలారా! లేచిరండు. మీరింతాలస్యము చేసితిరి. అక్కడ జీవాత్మల సమ్మర్దము గలిగియున్నది. ఉన్న దేవవిమానము లన్నియుఁ జాలకయున్నవి.

ఊర్వ—విమానములు చాలకపోయిన మేము మోసికొని రావలయునా?

4వ దేవసేవ—మోసుకొని రావలసివచ్చిన రానేవలయు.

రంభ—ఇదేమి బాధ? మనకిది యేండ్లకొలఁది జరుగఁబోవచ్చునే? ఊర్వశీ! ఇందులకేమి చేయవలయు?

4వ దేవసేవ—వైకుంఠమునకుఁ బోవుజీవుల మహోత్సవమునకు నప్సరో నాట్యముండ వలయునని విధించిన బ్రహ్మతో మొఱఁబెట్టుకొనుఁడు. ఎవ్వరినడిగిన నేమిప్రయోజనము?

మేనక—రంభా! ఊర్వశీ! ఈ దేవసేవకుఁ డేపోయదాటున నాడినమాట మన కుపదేశప్రాయముగానే యున్నది. మనమందఱము గుమిగూడి యిపు బ్రహ్మ యొద్దకే పోవుదము. ఈ బాధఁ దప్పింపుమని యా హిరణ్యగర్భుని వేఁడికొందము.

3వ దేవసేవ—మీరు మాటలలోనే జాగుసేయుదురే? అదిగో చూడుఁడు మఱియొక సేవకుఁ డా వైపునుండి పరుగెత్తి వచ్చుచున్నాఁడు మిమ్ములను పిలుచుటకు. రండు. లెండు.

అందఱు రభసమున నిష్క్రమింతురు.

—(:o:)—

## ద్వితీయాఙ్కము-తృతీయరంగము.

---

### బ్రహ్మ సభ.

[ ప్ర: బ్రహ్మ-సరస్వతి-ఋషులు-సనకుఁడు-సనందుఁడు-
యముఁడు-నారదుఁడు.]

అనుబంధము 5.

బ్రహ్మ—ధర్మరాజా! మఱేమి వచ్చియుంటివి? నావలనఁ గావలసినకార్య మేమైన నున్నదియా?

యమ—ధాతా! నిను దర్శించుకొనుటకంటె నాకుఁ గార్యమేమి? విరామములేక పగలును రాత్రియు జీవవిచారణవలన నున్న కాలమున నిన్ను దర్శింపవలయునన్నఁ దీఱిక యొకప్పటికే దుర్లభము గానుండె. ఇప్పుడన్ననో యెనలేని విరామము నాకు లభించియుండుట మొన్ననే విన్నవించితిఁగదా?

చ. ఒనరిన కార్యభారమున నుజ్జ్వలజీవవిచార మెప్పుడున్
వదలక చేసి బాధ లనివార్యముగా నిడుచున్న దానికిన్
ఇదెయవకాశ మిప్పుడు రహించె భవాదృశు లైనవారి స
త్పదములఁ గొల్వవచ్చుటకు భాగ్యముగా దె సరోజసంభవా.

నినుబోలు గొప్పవారి సందర్శనమునకుఁ బుణ్య సంపాదనమునకు నాకిప్పుడింత యాస్పదము కలిగియున్నది.

బ్రహ్మ—సంతోషము. ధర్మరాజా! నీకిప్పుడు పనియే లేకున్నదిగదా?

యమ—పొత్తిగా లేకున్నదని చెప్పుటకు లేదు. ఇన్నాళ్లుండిన పనిలో శతాంశమైన లేదు.

బ్రహ్మ—ఇదియంతయు రుక్మాంగదు హరివాసర వ్రతాచరణ మహాత్మ్యమేగదా?

యమ—అన్నిటికిని నీవేకదా కర్తవు? నీవు వ్రాయక వ్రతాచరణమున జీవుల కెల్ల వైకుంఠగమనము లభించియుండునా?

బ్రహ్మ—ఓ శమనా! ఈ కార్యలోపమువలన నీకేమైన మనసునకుఁ గొదవగానున్నదా?

యమ—అయ్యో! కమలాసనా! అట్టి చిన్నతికైన నుందునా? కార్యమువలన వేసట గొనక చేయుచునే యుంటిని. కార్యము లేకున్న మఱియు మేలయ్యె భగవత్కైం

కర్యమునకుఁ దన్నామ స్మరణకు నినుబోలు విజ్ఞుల సందర్శించుకొనుటకు సత్పూర్వ రీతిగా నాకు విరామ మొదవినందులకు మనసున సంతోషము వొడముఁగాక కొదవ జనించుటకుఁ గారణమేమి ?

సీ. సతతంబుసంగీత సాహిత్యవిద్యల
గారవించుటకవకాశమబ్బె
నతిశయంబుగ మిత్రతతులతోడ వినోద
గోష్ఠిసేయుటకనుకూలమయ్యె
నెమ్మదిఁగడుభక్తి నిండారమిముఁబోటి
పెద్దలదర్శింప వేళఁగలిగె
నరుదారురీతిగా హరినామకీర్తనల్
తమిదీఱసేయంగసమయమొదవె
తే. గీ. నరసిచూడంగరుక్మాంగదావనీశు
నలలితైకాదశీవ్రతసత్ఫలంబు
నాకుమోదంబునకుఁగారణంబుగాక
వారిజాసన కొదవకుఁగారణంబె.

బ్రహ్మ—మిక్కిలి సంతసించితిని.

యమ—నేనొకటి విన్నవించెద. నీమనసునకుఁ గొదవగలిగెనాయని నన్నడిగితివే యందునకుఁ గారణము మేమియని యడుగవచ్చునా ?

బ్రహ్మ—మఱేమియు లేదు. జీవసంచారము లేక నరములన్నియుఁ బాడుపడియుండినది చూచి నీకు సంతాపము కలిగెనదని నే వినుటచే నామాట యడిగితి.

యమ—ఎట్టివారికైన జీవహింస చేయుటకు లేకపోయెనే-నరకములవారి బాధించుటకు లేకపోయెనే యని సంతాపము వొడముటకాస్పదమగునా ? ఈ మాట నీ కెవ్వరు చెప్పిరి?

బ్రహ్మ—ఎవరో ప్రస్తావవశమున వచించిరి.

నారద—కృతాంతా! నేనే చెప్పితిని. కొన్ని నాళ్ళకుముందు నేను నీలోకమునకువచ్చి వినోద సంభాషణము జరుపుకాలమున నేకాదశీ వ్రత ప్రభావము ముచ్చటించుచు జీవులు పాపమొనరించినను దత్ప్రభావముల నా లోకమునకు రాకున్నారే యని విచారము జనించెనునని నీవనియుండలేదా ? అదియే వచించితి.

యమ—ఆమాటయా? నేనన్న వృత్తాంతమేమి నీవుచెప్పిన వృత్తాంతమేమి? చతురాననా! నే నన్న మాట యిది. జీవులు పాపమొనరించినను, వా పాపమునకుఁ దగిన శాంతివడయక యేకాదశీ వ్రత ప్రభావమున నాపాపము మాటి పుణ్యము గలిగి వైకుంఠమునకుఁ బోవుచుండుటశోచనీయ విషయమనియు, దురాత్ములగువారికి నావ్రతమును మాత్రము నమ్మి యితరవిషయములఁ బాపమొనరించినను బాధకము లేదనియు నెక్కడలోఁచునో యని భీతికాస్పదముగా నున్నదనియు నే నాడితి. దాని ననుసంధించి నీ పుత్రుఁడగు నీ నారదుఁడు జీవవిచారము చేయమికి నేనేమో దుఃఖించునట్లు వచించియున్నాఁడు. అతని స్వభావమేకదా ?

నారద—నాస్వభావమేమియుఁ గాదు. నీమరావమే ? నీమనసున నేనునుకొంటివో కాని వెలికి మాత్రము జీవులకు నరకబాధలు పొసఁగుటకు లేదయ్యె నేయని నీవు దుఃఖించినట్లె నాకుండోఁచెను. ఉన్నమాటయే చెప్పితిని.

[ ప్ర: ఒక ఋషి. ]

ఋషి—కమలాసనా ! విష్ణులోకమునుండి సేనానియగు విష్వక్సేనుఁడు వచ్చియున్నాఁడు.

బ్రహ్మ—(లేచి) మనమందఱము పోయి పిలుచుకొని వత్తము (ఋషులతోఁబోయి విష్వక్సేనునిఁ బిలుచుకొనివచ్చి పీఠముపైఁ గూర్చుండఁబెట్టును)

విష్వ—ధాతా ! మీకెల్లరకుంగుశలమా ?

బ్రహ్మ—సేనానాయక! అంతటికిని గుశలమే. నీవిందు విచ్చేయుట యా మహావిష్ణువే యనుగ్రహించి నట్టులయ్యె. ఏదో ఘనకార్యముండవలయుఁగాక లేకున్న మహామహుఁడవగు నీవు వచ్చియుందువా? ఆనతిచ్చిన నదెట్టికార్యమైనను శిరసావహించి చేసెద.

విష్వ—కమలాసనా! ఘనకార్య మేమియులేదు. ఒకానొక పనికై నీతో నాలోచించి రమ్మని కమలానాథుఁడంపియుండ వచ్చియున్నాఁడను. రుక్మాంగదునేకాదశీ వ్రత మాహాత్మ్యమున జీవులెల్ల వైకుంఠమునకే వచ్చుచుండుట నీ వెఱుంగుదువుగదా? ఆ వైకుంఠము వైశాల్యమున లెక్కింప నలవిగాని విరివిగలిగియుండియు నిండుచు వచ్చియున్నది. మిద్దెలు మేడలెల్లఁగిక్కిఱిసియున్నవి. ఇంకఁ గొన్నినాళ్లు మాత్ర మీరీతిగానే జీవాత్మాగమనము జరుగుచుండెనా చోటులేకుండెడు. కావున ముందునకు ముందే తగిన ప్రయత్నమును జేసి యాపట్టణము నింకింత పెంచుటయో లేదా మఱియొక వైకుంఠము గల్పించుటయో యీవిషయమున నిన్నడుగవచ్చితి.

బ్రహ్మ—సూత్రవతీనాథా! సంకల్ప మాత్రమున మాదృశులఁ గోట్లకొలఁది సృజింపఁగల యా వైకుంఠనాథునకు నిదియొక్క యోచనయా? నన్నింత పెద్దచేయుట తలంపతనికిఁ గలిగెఁగాక.

## అనుబంధము 6.

అందుకు యోచన యకించనుఁడైన నేఁజెప్పఁగలనా? ఆమహామహుఁడెట్లొనర్పుమని యాజ్ఞయిడిన నట్లొనర్చుటకు సిద్ధముగా నున్నాఁడను.

విష్వ—ధాతా! అందునకుగాను. ఆమహాత్మునకు నెంత సామర్థ్య ముండినను సృష్టిక్రమమంతయు నీవలననే జరుగవలయునుగదా? కావున నీతో నాలోచించుటకు నన్నంపియున్నాఁడు. విశ్వకర్మ యెన్నియో గృహములు సౌధములు నావైకుంఠమునఁ గట్టియున్నాఁడు. ఎన్నికట్టినను జాలకున్నది. ఇప్పటికేమో చాలినంత ప్రదేశమున్నది నిక్కువమే? ఇంకఁగొన్నియేండ్లుమాత్రముపోయినఁజోటుచిక్కదు. నూతనగృహనిర్మాణమునకు నెడముచాలదు.

బ్రహ్మ—వేత్రధరా! అయ్యాదివిష్ణు వేమొనరింప నాజ్ఞయిడిన నాకార్యమొనర్చుటకు సిద్ధముగానున్నాను.

విష్వ—ఇప్పటికిమాత్రము విశ్వకర్మవంటివాని మఱియొకని సృజింపుమనియుఁ గొన్ని యేండ్లకే వైకుంఠాంతర నిర్మాణ మవశ్యముగా నుండుననియు శ్రీధరుండు వచింపు మనినాఁడు.

బ్రహ్మ—భాగ్యము. మదినుంచుకొనెద.

యము—అబ్జగర్భా! ఇది చిత్రముగదా! నాలోకమెల్ల నివసించువారులేక పాడు వడుటకుఁ గారణమయ్యె. అందో మఱియొక్క లోకము నిర్మింపవలసివచ్చె.

( ప్రవేశము: ఋషి. )

విధాతా! దేవలోకముననున్న యప్సర స్త్రీలందఱు వచ్చియున్నారు.

బ్రహ్మ—మిక్కిలి మేలయ్యె. మంచిసమయము. రాక రాక, శ్రీధరప్రతినిధియగు నీ సేవాని వచ్చియున్నాఁడు యముఁడును గార్యాంతరము లేకయాసీనుఁడైయున్నాఁడు. రమ్మనుము వారి నాట్యమో గానమో జరిపింతుము.

(ఋషి నిష్క్రమించును.)

( ప్ర: రంభ-ఊర్వశి-మేనక-తిలోత్తమ-మొదలగువారు బ్రహ్మకు నమస్కరించి )

## అనుబంధము 7.

బ్రహ్మ—అచ్చరలారా! రండు. మీలోకరొకరు వచ్చుటకే కష్టముగనుండునే! ఉన్న యచ్చరలెల్ల నొక్కసారియే వచ్చియుండుట వింతయగుఁగడా?

మేనక—దేవా! ఒకవిన్నపమొనర్ప వచ్చియున్నారము. అనతిచ్చిన విన్నవింతుము.

బ్రహ్మ—ఏమది?

మేనక—స్వామి! భూలోకమునుండి వైకుంఠమునకుఁ జేతులుగట్టి పోవు జీవాత్ముల వెంట నప్సరో నాట్యముండవలయునని నీవే విధించితివో యింకెవ్వరు విధించిరో తెలియదు కానియావిధమును మేమిప్పుడు కంటగించుచున్నాము. పగలును రాత్రియుఁ విరామము లేక మాకెల్ల నాట్యకార్యమే యేర్పడినది. మేము మితసంఖ్యవాల మీ కదా యుండుట? అసంఖ్యయొంతమాత్రమును జాలకయున్నది. కావున మావిన్నప మింతయే. వారివెంట నుత్సవమునకుఁ బోవుటకు మాయావశ్యకత తప్పించితివా బ్రతుకు కొందుము. ఒండేని యింకను నెక్కువ సంఖ్య యప్సరలనైనను సృజించి పుణ్యముఁ గట్టుకొనుము. ఈ రెండింటిలో నొక్కటి యొనర్పకుంటివా మాకు బ్రతుకు లేదు. మేము నిర్జరులమే యమరులమే నిక్కము. ఐన నింత యలవిలేని వ్యాయామము మాకుఁ గలిగియున్న మాకిర్జరత్వము, మాయమరత్వమును, మాకు లేకుండిన మేలని యనిపించుచున్నది. అనుగ్రహించి మము రక్షింపుము.

బ్రహ్మ—అచ్చలారా! కూర్చుండుఁడు.

రంభ—అయ్యో! విధాతా! మే మెక్కడఁ గూర్చుండఁగలము.

## అనుబంధము 8.

ఈయింత సేవచికే మేము లేనందునజీవ వైకుంఠయాత్రోత్సవమున నల్లోలకల్లోలమై యుండును. ఎంచఱు దేవసేవకులో మాకొఱకు వెదకుచుందురు. మేమునితరాప్స రలవేఁడుకొని కొంత కాలము మాత్ర మవకాశము పడిసి వచ్చితిమి. మాకేమి యాజ్ఞయొసంగెదవు.

బ్రహ్మ—వనితామణులారా! మీకు మిక్కిలి శ్రమగలుగుట నేనొప్పుకొందును. ఐన నిందున నాయత్నమేమియు లేక యున్నది. వైకుంఠమునకుఁ బోవువారికి మీ నాట్యము తప్పక యుండవలయుననుట నే రచించిన విధానము కాదు. అదియుండీ వేదములతోఁగూడ నుద్భవించిన విధానముగనున్నది. అది మార్చుటకు నెప్పటికిని సాధ్యము కాదు.

## అనుబంధము 9.

ఇంక నూతనాప్సరో నిర్మాణమునకా? అది నాకు సాధ్యమా? మీ జననమున్న నెట్టి యసాధ్య కార్యమువలన లభించినది. దేవాసురుల యుద్ధ నెపంబున నెల్ల దేవతలు నెల్లరాక్షసులుఁజేరి యేకమై మంధరమును మోసితెచ్చి విశ్వప్రయత్న మొనరించి శ్రీహరికిఁ గూర్మావతారము కలుగునట్టుచేసి యసాధ్య ప్రక్రియగా క్షీరసాగర మథనముఁ గావించి యింత ప్రయత్న మొనరించినఁగదా మీ జననము గలిగె? ఇప్పుడింకెట్లు చేయవలయు? ఈ రెండును నా చేతఁగాని పనులే.

ఊర్వశి—అయిన మాభాగ్యమింతయే కదా సంకల్ప మాత్రమున జగత్సృష్టి యొనర్పఁ గలిగి నీవే మా కష్టములకుఁ బ్రతిక్రియ కావింపఁజాలవన్న మా దురదృష్ట విశేషమే కదా? ఇంకెవ్వరిని వేఁడుకొనఁగలము.

బ్రహ్మ—తరుణీమణులారా? విధి విధానమున నన్ని కార్యములు జరుగనే వలయుఁ గదా? వాని కెవరేమి చేయఁగలరు. మీకష్టము నిరంతము నుండఁగలదా? కాలము నిరీక్షించి యుండుఁడు. మీకష్టముల కంత్యము కానేవలయు. ఏవిధానముగాని యెల్లకాలము నొక్కరీతిగా నుండదు. పోనిండు. యోచింపకుఁడు. నాపై ననుగ్రహమున నిదే విష్ణుసేనాని యీనాఁడు విచ్చేసియున్నాఁడు. శమనుఁడును గార్యాంతర ప్రసక్తి లేమి ననుంజూడ నరుదెంచి యున్నాఁడు. మీరును యాచింపకయే వచ్చియున్నారు. ఏది మా వీనులకు విందు నాట్యముతోఁగూడ గానము నింత వినిపింపుఁడు.

ఊర్వ—దేవా? మీకెల్లరకు నిరంతర గానమున రాసుగొంతును, నిరంతర నాట్యమునఁ జచ్చుకాళ్లును లభించియున్నవి. ఐనను మహాత్ముఁడవగు నీవాజ్ఞయిడిన వలదనఁ జాలుదుమా? శిరసావహించెదము.

అనుబంధము 10.

—: ద్వితీయాఙ్కము సంపూర్ణము :—



శ్రీ

# మోహినీరుక్మాంగద నాటకము.



## తృతీయాఙ్కము-ప్రథమరంగము.



### రుక్మాంగదు నగరు

[ప: గర్భవతియగు రుక్మాంగదు రాణి సంధ్యావళి పడక పైఁ బండియుండ రుక్మాంగదుఁడు ప్రక్కనఁ గూర్చుండియుండును.]

రుక్మా—ఇప్పటికి నేధన్యుఁడ. ఈతన్వి యింత నిద్రించియున్నది. ఏ మపాయము కలుగునోయని భీతిల్లియుంటిని. ఆపద్బాంధవుఁడగు వాసుదేవుని నమ్మి తదనుగ్రహమే యెల్లవేళలఁ గోరు భక్తులకు నేకీడుఁగలుగునే? అదిగో మెదలుచున్నది.

సంధ్యా—(మెల్లఁగ లేచి కూర్చుండి) నాథా! ఎంతసేపైనది నీవువచ్చి?

రుక్మా—దేవీ! కొంతసేపైనది. ఇప్పుడు కొంచెము లఘువుగా నున్నదియా?

సంధ్యా—ఇప్పుడేమియు నున్నట్టులేదు. ఈ నిద్రవలన బాధయంతయుఁ దీసిపోయి నట్టున్నది.

రుక్మా—తరుణీ! భగవద్భక్తులమగు మనకు నెన్నటికిని జేటుగలుగదు. నేను మిక్కిలి బెగడుపడియుంటి. పూర్ణ గర్భభారము ధరించియున్న నీ వవశ్య కరణీయమగు చతుర్భుక్తి వర్జైకాదశీ వ్రతము నాచరించియుండుటచే నించుక యాయాసమునకుఁ గారణమయ్యె. వైద్యుని ప్రభావమున మొన్నటినుండి క్రమక్రమముగా నీకారోగ్య స్థితి యున్ముఖమయ్యె నేఁడు నిద్రయుంవచ్చె. ఇంకేమి భీతియులేదు. తరుణీ! మొన్న నీవు మాటలాడిన మాటలు తలఁచుకొన్న నిప్పటికిని నాకన్నులకు నీరు వచ్చుచున్నది.

సంధ్యా—నాథా! నేను బ్రతుకుదునని నిశ్చయముగా నమ్మియుండలేనుకదా? కావున నాతీరున మాటలాడితి.

రుక్మా—రమణీ! సంతానములేక యన్నిదేవతలఁ గొలిచి తత్ప్రార్థన ఫలముగనీవాపన్నసత్త్వవై యుండినందున నీనులేని సంతోషము వహించి నాకెన్నఁడు కుమారుఁడు కలుగునని మితిమీఱిన కాంక్ష నెదురు చూచుచున్న నాకు నీయాయాసముగాంచిన

లోకమే మునిఁగినట్లుండె. ఇప్పుడింత దైవానుగ్రహము గలిగినందున నూఱటకుఁ గారణమయ్యె మనోహారిణీ! వింధ్యాద్రిలోనున్న మునయిలు వేల్పగు చంద్రహాసే శ్వరునకు నయుత కుంభాభిషేక మొనర్చెదనని మ్రొక్కుకొంటిని. ఆమహాత్ముని ప్రభావమువలన నేనీకుని రామయత కలుగఁగలదు. ఎక్కువగమాటలాడిన నీకాయాస మగును. నేనుపోయివత్తును మనకింత సమ్మదము గల్గించిన యీశ్వరు నుపాసింతము.

సీ. కదలిపాఱిని తేరు వదలిపాఱిని పేరు
జరుపఁగా మెఱుపఁగా నెఱుఁగ రేని
పానపెట్టనియమ్మ మేనఁబుట్టినసొమ్ము
పట్టఁగాఁబెట్టఁగాఁబుట్ట రేని
కంతుగందవుఁబూఁత వింతచందపుమేఁత
పూయఁగా మేయఁగా డాయ రేని
మింటఁబుట్టినధార ముంటఁగుట్టనిచీర
తలయందు మొలయందుఁ దాల్ప రేని

గీ. మెఱుపువిల్లు విలాసంబు నెఱుపునిల్లు
గలుగ నులికెక్క రేని నాకరము లెత్తి
మ్రొక్కవటువంటి దేవసమూహములకుఁ
గ్లేశభవభంగ యిష్టకామేశలింగ.

(నిష్క్రమింతురు).



## తృతీయాఙ్కము ద్వితీయరంగము.



### అమరాతిలో మేనకయిల్లు

[ ప్ర: రంభ-మేనక-ఊర్వశి-తిలోత్తమ-హారిణి-హేమ-
వరూధిని-మోహిని. ]

ఊర్వశి—బ్రహ్మపైఁ బెట్టుకొనిన యాశయెల్లయు నిన్ననే తీఱెఁగదా? ఇంకేమి చేయుదము?

రంభ—ఏమిచేయుటకు నేమియుండదోఁపకున్నది. ఆరుక్మాంగదుఁడు చచ్చువఱకు మన బాధయిట్లె యుండఁగలదని నే నెంచుచున్నాను.

ఊర్వశి—చచ్చినపిదపమాత్ర మతఁడు విత్తిన యీ వ్రతబీజము పెరిగి వృక్షముగాక నిలుచునా? ఎప్పటికి మన కిదేగతియని యెంచవలయును.

మేనక—అట్లేలగును? రుక్మాంగదుని యాజ్ఞకు భయపడి జనులు విధిలేక యీ వ్రతాచరణ మొనర్చుచున్నారు గాని, యతనిపిదప నెట్టి యాచరణముండఁజాలదని నే నమ్మెద.

తిలో—నాకు నట్లె తోఁచుచున్నది. నిన్న బ్రహ్మను సందర్శించినప్డు రుక్మాంగదుఁ డింకను నెన్నిదినములు మనియుండఁగలఁడో యదియైన విచారింపక పోయితిమి. అదిగో! అప్పుడే జీవయాత్ర మొదలుపెట్టినది. దేవసేవకుఁడు పిలువవచ్చుచున్నాఁడు. హారిణీ! నీవుపోము.

(హారిణి—నిష్క్రమించును).

ప్రవేశము: [ హరిభజన మొనర్చుచు ] నారదుఁడు.

(అందఱు నమస్కరించి పీఠమిత్తురు.)

మేనక—నారదా! నీయీయాగమనము మమ్ము ధన్యులఁగాఁ జేసె. ఎక్కడకుఁ బోవుచు వచ్చితిరి? మాయెడ మీ కెంత యనుగ్రహము!

నారద—అప్సరోమణులారా! విమానారూఢుఁడనై యట్లె పోవుచుంటిని. మీరెల్ల నీ మేడపైఁ జేరియుండ నాకచ్చెరువు జనించి వచ్చితి.

మేనక—అచ్చెరువేల?

నారద—మీరొకరొక రొక్కొక్క లోకమును స్వాధీనమునం దుంచుకొనుటకు సమర్థులు. తపోనాశన మొనరింప వలయునన్న, నా కార్యమున మీ యహంపూర్వికయత్యద్భుతము. మీ రొకరితో నొకరు కలయువారు గారు. ఇట్లు కలసియుండుటచ్చెరువే గదా?

మేనక—ఆమాటకా! మాకేమియు నొకరియెడ నొకరికి స్పర్ధ లేదు. అసూయయు లేదు. నారదఋషీంద్రా! బ్రహ్మసభలో మేము మొఱపెట్టుకొన్న కాలమున, నీవు నుంటివే. ఈ రుక్మాంగదుఁడు మాకెక్కడ దాఁపురమాయెనో? అతని యేకాదశీవ్రతము మాకు మారణ మంత్రముగా నున్నది. బ్రహ్మయు మా బాధలఁ దీర్పఁ దన చేతఁ గాదని యొప్పఁ జెప్పె. ఋషిచంద్రమా! నీవునుమా యటబ్రహ్మవేయగుదువు. దీనికేమైనఁ బ్రతిక్రియ దోఁచియున్న దయచేసి చెప్పరాదా?

నార—వనితామణులారా! మీకు నేనేమి చెప్పఁగలను? నా సంగతియుఁ సమీపమునకు వచ్చునట్లున్నది. ఈలోపల విష్ణుదూతలు జీవముల నూరేగించుకొని పోవునప్పుడు గొప్పవారి జీవాత్మలకు గంధర్వులు చాలక నన్నును దుంబురుని బిలువ నడుకట్టియున్నారు. ఎట్లో యీపనికిఁ దప్పించుకొని యున్నాము.

మేన—అట్లయిన వనితామణులారా! మనరూప ప్రభావమున నా రుక్మాంగదు నిర్జించి యీ యేకాదశీవ్రతము మాన్పింపవలయుఁ. ఇది తప్ప నుపాయాంతరమే లేదు. నేనే పోయెదను.

ఊర్వశి—మేనకా! నీ కేటికింత శ్రమ? నేఁ బోయెదను.

తిలో—విశ్వామిత్రుఁడు మొదలగువారిఁ బోలిన గొప్పవారైన మిమువంటివారికి శ్రమయివ్వవలయు. ఈ రుక్మాంగదునంత వానికి మీకేల? మేమెవ్వరైనఁ బోయెదము.

మోహిని—అక్కలారా! నా విన్నప మొక్కటి కలదు. మీరెల్ల జగత్ప్రసిద్ధిఁ గాంచిన వారలు. రూపమున నేమి, ప్రభావమున నేమి, మిమ్ముఁ బ్రశంసింపనివారే కలుగరు. నేనన్ననో పేరుమాత్రము మోహిని యని యున్నదిగాక, నా సమ్మోహన ప్రభావమెవ్వరు విని యుండలేదు. ఈ రుక్మాంగదునకు నేనచాలుదు. నన్నంపుఁడు. నేఁబోయి మీ కెల్లరకు ఖ్యాతిఁ దెచ్చెద.

మేనక—మోహినీ! నీవంతకుఁ జాలుదువనుటకు సందేహమేమి? ఏదీ? నీ చాతుర్యమైనఁ దిలకింతేము. నీవేమి చేయుదువు? ఎట్లీ కార్యము సాధింతువు? వచింపుము.

మోహిని—వచింప వలసినదేమున్నది? నా మోహవాగురలలో రుక్మాంగదుఁ జిక్కించుకొని నేనాడించు నట్లాడఁజేసి యీ వ్రతము మాన్పఁ బ్రయత్నించెద.

మేనక—చూడు మది కార్యము. ఇంకెక్కువగా నేమి చెప్పవలయు?

రంభ—సఖీ! మోహినీ! ఇదివఱకు దేవేంద్రుఁడు తపస్వుల యెడకు మమ్ముఁ బంపుచుండుఁ గదా? అతని కార్యముకొఱకు మేము ప్రయత్నించి యతుఁ నెల్లమాటు

కొలిపి దేవేంద్రునిచే మెప్పులు వడయుచుంటిమి. ఇప్పటిపనియన్న నట్లుకాదు. స్వంతకార్యము. రుక్మాంగదు జయించితిమా మన శ్రమలెల్లఁ బరిహారములగు. ఎంతనేర్పరిగాఁ గార్యము సాధించెదవోసుమా ?

మోహినీ—అక్కా! అప్సరలలోఁబుట్టి యింతకార్యము సాధింపలేక మీకందఱికి నప కీర్తి తెచ్చెదనా? మీరేమియు యోచింపకుఁడు. ఆరుక్మాంగదుఁడన్న నెంతవాఁడు. వాని ధూపార్తి యిటుఁగాఁ జేయఁజాలకున్న నేనొక యచ్చరనా?

నారద—రంభా! ఈ మోహిని తానన్నంతపట్టును జేయఁగలదియే. మిక్కిలి చాక చక్యముగలది. మోహినీ! ఎట్లయినఁజేసి నీ వీకార్యము సాధింపనేవలయు. నీవు మాకును నువకారము చేసినదానవగుదువు.

మోహినీ—నారదా! నీ యాశీర్వాదమున్న నాకిది యెంతకార్యము ?

మేనక—అదిగో పలువురు దేవసేవకులప్పుడే వెతకు వెత్తుచు వచ్చుచున్నారు. ఈ జీవా త్మల యబ్బఁగంటంతయు మాయొద్దఁ బూడిచిపెట్టినట్లు మమ్ము బాధించుచున్నారు. ఇంక మేము పోవలసియే యున్నది. మోహినీ! ఇక్కడికార్యములు మేమెట్లైనఁ జూచికొందుము. రుక్మాంగదు మఱల్పు కార్య భారమంతయు నీపైననే మోపి యున్నారము. లెండు—చెలులారా! పోవుదము.

(మోహిని తప్ప నందఱు నిష్క్రమింతురు)

మోహిని—నేనును బ్రఖ్యాతిఁజెందుట కిదిగదా సమయము! మొదట నతనియూరికి వేషాంతరమునఁబోయి యతని వృత్తాంతమంతయు వరసెద. పిదప సందులకుఁదగిన విధాన మాలోచించెద.

తే. గీ. రంభకును మేనకకును నుర్వశికి ధరణి
నెందునెనలేని ప్రఖ్యాతి యొసఁగెఁగాదె
యూర రుక్మాంగదునివ్రతం బడఁగఁజేసె
మోహిని యటన్న విఖ్యాతి మొనయుదాన.

(నిష్క్రమించును).

———(:o:)———

# తృతీయాఙ్కము-తృతీయరంగము.

---

## విష్ణుదేవాలయము.

[ ప్ర: మోహిని (పురుష వేషమున). ]

మోహిని—ఏమి జనులు కలసియున్నారు! పదివేవు రుండవచ్చును. ఈదిన మేకాదశి యగుటజాగరమునకురుక్మాంగదుఁడేవచ్చునట్లున్నది, విష్ణుదేవాలయమునకుఁ కావున నింత జనసమ్మర్దము కలిగియున్నది. ఆహా! రుక్మాంగదుఁడే మీ వేషమున వచ్చుచున్నాఁడు? జాగరమునాఁ డిట్లనేకాఁబోలు. అదియేమి హరికథా కాలక్షేపమున కుద్యమించినట్లున్నది. ఔరా! తెలిసె. ఈ రాజేంద్రుఁడు జాగరమునాఁడు తానే హరికథచెప్పుటయుఁ గలదని తోఁచెడు. ఇది యాశ్చర్యకరమైన విషయమే! చూచెదఁగాక యెట్టివేడుక జరుగఁగలదో? ( ప్రక్కనఁ గూర్చుండును).

(వెనుక యవనికనెత్తఁగా- మృదంగాది వాద్యములవెంట రుక్మాంగదుఁడు హరికథోద్దేశమున గాన మొనర్చుచుండును. జనములుండురు. రుక్మాంగదుఁడు హరికథా కాలక్షేప విధానముగా నుపన్యసించును. పిదప ముందఱి యవనికపడును).

మోహిని—(ముందఱికివచ్చి) ఆహా! ఏమి యీ రాజేంద్రుని విష్ణుభక్తియు గానచాతుర్యమును, నద్భుతముగా నున్నవియే! తానే యిట్లుపన్యసించుచు జనులకెల్ల భక్తిమార్గము గఱపుచుండ జనుల యాత్మలు పైపైనెంతమున కరుగుటయరుదా? ఈ రాజేంద్రపరేణ్యుఁడాడ నేను పైవేసికొనియున్న కుహకమోహమంతయుఁ దీఱి నిక్కమగు మోహ ముప్పతిల్లుచున్నది. అయినను జూచెద. ఈరాజు నెట్లు మరులుకొలుపవలయునో యావిధానమే తోఁపకున్నది. అతనియింటికి నేనేపోయి కనిపించుకొంటినా, పలుచఁదనమునకుఁ గారణమగు. ఇంకెట్లు చేయవలయు? ఆరాజు ననుజూచు విధానమైననెయ్యది? ఇతనికిగానమునమునందు మిక్కిలి ప్రీతియౌటచే గానమూలముననే యితనిమనసు గరఁగింపవలయు. దైవభక్తి మెండగుటచే నేనును నెక్కుడుగా దైవభక్తి గలిగియున్నట్లు నటించి మదికెక్కవలయు.

[ ప్ర: (మాటలాడుకొనుచు) ఇరువురు పౌరులు. ]

1. పౌర—ఓరీరాజుగారు మాత్రమే వెడలుదురఁట. అమ్మగారు పోవరఁట. వినలేదా?

మోహిని—(స్వగతము) రాజుగారెక్కడకుఁ బోవుదురు? అమ్మగారేలపోరు?

2. పౌర—అమ్మగారును బోయియుండిన మాకే కాక మనయాఁడువాండ్రకు సహితము వాయనములు లభించుచుండెను.

1. పౌర—ఒక్కొక్క ఘటమున కొక్కమాడచొప్పున దక్షిణలిచ్చెదరు వినలేదా ?

2. పౌర—తెలియును లెమ్ము. నేఁడు క్రొత్తగఁ జూచెదమా ? ఎప్పటికి నిట్లేకదా ?

(మోహిని ముందఱికివచ్చి).

మోహిని—బ్రాహ్మణోత్తములారా ! రాజుగారెక్కడకుఁ బోయెదరు ? ఎవ్వరు పోయెదరు ?

1. పౌర—నీది యేయూరు?

మోహిని—నేను పరస్థలమునుండి వచ్చియున్నవాఁడను.

1. పౌర—ఎంత పరస్థలమైనను మాఘమాసములో శివరాత్రి వచ్చుచుండఁగా, మారాజుగారు వింధ్యాచల ప్రాంతమునఁ జంద్రమౌళీశ్వరుని కయుత ఘటాభిషేకము చేయించుమాట తెలియదన్న నేమనవలయు ?

మోహిని—ఔనయ్యా ! నేను దూరదేశమునకుఁ బోయియుంటిని గాన వినలేదు. శివ రాత్రి మూఁడుదినములు మాత్రమున్నదే. ఇంకెప్పుడు వెడలెదరు.

1. పౌర—మారాష్ట్రములోనుండి యీ వృత్తాంతము తెలియదన్న నీ వెవరవో? నీతో మాకేమిమాటలు పొమ్మ

(పౌరులు నిష్క్రమింతురు).

మోహిని—ఇంతమాత్రము తెలియవచ్చెఁగదా? నేను మున్ముందుగా నక్కడికే పోవుదును. (నిష్క్రమించును).

[ తృతీయాఙ్కము-సమాప్తము. ]



శ్రీ

# మోహినీరుక్మాంగదనాటకము.



## చతుర్థాఙ్కము-ప్రథమరంగము.



### వింధ్యపర్వతములోని యిష్టకామేశ్వరాలయము.

[ ప్రః మోహిని. ]

**మోహిని**—మొన్ననే చతుర్దశి. అయుత కుంభాభిషేకమీ స్వామికి జరిగినది. పూజావిధానములన్నియు ముగిసినవఁట. ఈనాఁటివఱకు నాకా రాజేంద్రుని జూచుట కాస్పదము కాలేదు. నేఁ డీస్వామియొద్దకు నా మహీశుఁ డేకాంతసేవకు వచ్చునఁట. ఇప్పుడు తప్పిన నింక సంవత్సరమువఱకు సమయ మొదవదు. సంగీతకళానిధియు, భాగవత శిఖామణియు, ధర్మమార్గ ప్రవర్తనాపారీణుఁడును నైన యీ రుక్మాంగదుపై నాకేల యింత భక్తిపూర్వకమైన మోహము సంభవించినది! కపటమోహము పూని నాలుగుదినములు కార్యము చూచుకొని వ్రతభంగ మొనర్చిపోవ నుద్దేశించియున్న నాకు నిటు నిక్కంపుమోహమున్న నే నేమి కార్యము చేయఁగలను?

(లోపల రుక్మాంగదునిధ్వని "మీరక్కడనే యుండుఁడు".)

**మోహిని**—అదిగో! వచ్చుచున్నాఁడు ఇఁక నా కార్యమునకుఁ బ్రారంభింతును.

(అని వీణపెట్టుకొని).

సీ. అంభోజభవసురేంద్రార్చితచరణాయ
మరణదూరాయ నమశ్శివాయ
పద్మాప్తకోటిప్రభాదివ్యదేహాయ
మఖసంహరాయ నమశ్శివాయ
డమరుత్రిశూలఖడ్గకపాలహస్తాయ
మథితదోషాయ నమశ్శివాయ
గగనకల్లోలినీకలితోత్తమాంగాయ
మౌళిచంద్రాయ నమశ్శివాయ

తే. గీ. మౌని సంసేవితాయ నమశ్శివాయ
మదనదర్ప హరాయ నమశ్శివాయ
మధువిరోధిశరాయ నమశ్శివాయ
మంత్రరూపాత్మకాయ నమశ్శివాయ

(ప్ర॥ రుక్మాంగదుఁడు (దూరమున).

రుక్మాంగ—(గానము నాలకించి) ఏ మీ గానచాతుర్యము! ఇట్టికాలమున, నెవ్వరీయు మేశపూజకు వచ్చియున్నారు? ప్రత్యక్షముగాఁ గోకిలయే గానము నేర్చి పాడుచున్నట్లున్నదే! ఇంకింత విందును.

మోహిని—

కం॥ శూలిన్ గపాలమస్తక
మాలిన్ నయశాలిఁ జంద్రమౌళిన్ గ్రతుని
ర్మూలిన్ సుగుణాలిన్ శుభ
శీలిన్ సారంగచర్మ చేలిన్ గొలుతున్.

రుక్మా—ఆహా! వీనులవిందై యీగాన మింతానంద మొనగూర్చునే! లోనికిఁబోయి యెవరో తిలకింతునా? పూజాభంగ మొనర్చితినని యీనారికిఁ గోపము గలుగునో?

మోహి—సీ. సీటఁదేలుశరంబు పాటసోలుసరంబు
ధరియింప భరియింపఁ దలఁపఁడేని
ఉబ్బిపాటిడియాలు బొబ్బలిబలుతోలు
జడలందు నొడలందుఁ బడయఁడేని
యుగము గాల్చినచేఁదు జగము గెల్చినజోదుఁ
గడిసేయఁ బొడిసేయఁ గలుగఁడేని
అలివేణివలిచంట వెలలేనివలియింట
నుండఁగాఁ బండఁగా నోపఁడేని

గీ. ఈడువత్తురె మీపాటి కితరమూర్తు
లవనిమండలి దేవవేశ్యాభుజంగ
త్రిపురసంత్రాస జాహ్నవీతీరవాస
క్లేశభవభంగ యిష్టకామేశలింగ.

రుక్మాంగ — ఆహా! ఏమి యీస్వరవైఖరి! ఎందెందును నేను వినియుండలేదుగదా! పూజాభంగమైనదుమానె. ఇంకేమైనమానె. పోయి చూచివత్తును. (మెల్లఁగా లోనికిఁబోయి మోహినిఁజూచి, దిగ్భ్రమము నభినయించి యొక్కింతసేపుండి వెలుపలికివచ్చి) ఆహా! ఎవ్వరీతరుణీలలామ! శచియో! రతియో! ఎవ్వరో యెఱుఁగఁగదా? ఇది యేరాకన్నియయో యప్సరసయో యుండవలయు. కాకున్న నేను చూచినవెంటనే నాకీతరుణిపై నింతవ్యామోహము పుట్టునా? ఇక్కడనేయుండి యీలలన పూజావిధానమైన పిదప నిక్కడకువచ్చెనా యెట్లయినఁజేసిమాటలాడించి చూచెద.

సీ. కందు చెందనిసుధాకరపూర్ణబింబంబు
మెఱసిపాఱకయున్న మెఱుపుఁదీఁగె
పంకంబునందుఁ గీడ్పడనిమృణాళముల్
కవవిచ్చిచనని జక్కవయుగంబు
వికసించి మొగడనివిమలాంబుజాతముల్
కర్కశంబులుగానికరికరములు
చిలుకముక్కంటనివలఁతిబింబఫలంబు
తతకాంతిఁబాయనిదర్పణములు
ఆ. అనఁగ నాననంబు నంగంబు హస్తముల్
చన్నుదోయి వాలుగన్ను లూరు
లలఁతిమోవి చెక్కు లలరు నియ్యరవింద
గంధి యెచటనుండు కాంతయగునొ.

ఆతరుణి యచ్చరవెలఁదియైయున్నఁబూజావిధానమైనపిదపనట్టేయంతర్ధానముఁజెందిన గతియేమి? లోనికిఁబోయి యిప్పుడే మాటలాడించెద. ఏల భయపడవలయు? (లోనికిఁబోవనుద్యమించి) వలదు వలదు. అది దుడుకుతనమగు. దేవాలయమున దైవధ్యానమొనర్చుచున్న యాతరుణీమణి యెవ్వరైనదియెఱుఁగక ప్రార్థనాభంగమొనర్చి మాటలాడించుట పాడిగాదు. ఈ యెడనేయుండి తిలకించుచుండెద. ప్రార్థన నిలిపినా పోయి ప్రశ్న మొనర్చెద. ఇంతలో నంతర్ధానమయ్యెనా దినదినము నిందేయుండి యెన్ని యేండ్లయినను మానక యాతరుణి మఱల సందర్శన మిచ్చువఱకు మానకుండెద.

మోహి—సీ. గంగానదీజూట కైరవాప్తకిరీట
శమనకవాట పశ్యల్లలాట
వ్యాఘ్రాసురాఖేట వనజాసనకరోట
విబుధపర్వతకూట వేదఘోట
మృత్యువక్త్రచపేట మిహిరపాదాశాట
జితకాలకూట యానతవిరాట
దూరీకృతారాట త్రుటితకుంభినిశాట
వరభక్తసంఘాట వజ్రఖేట

గీ. వాఙ్నిరాఘాట దురితపావకకృపీట
ఘనభుజాస్ఫోట భూమిపంకజవరాట
తాపసస్తోత్రవాచాల దక్షవాట
భీమశివలింగ హాటకస్తోమపాట.

(కొంచెమూరకుండి) ఆహా! ఆ ధరణీశవరుఁడు నన్ను దిలకించి యట్లే వెలికిఁబోయె. మరల రాఁడయ్యె. ఏమికారణమో? నేనేపోయి దర్శించుకొందు. (వెలుపలికి రాఁబ్రయత్నింప)

రుక్మా—(స్వగతము) ఆహా! గానము నిలిపినట్లయ్యె. ఇంకఁబోయి విచారింతును. (లోపలికి వచ్చును).

మోహి—ఎవరుమీరు?

రుక్మా—తరుణీ! నేను రుక్మాంగదుఁడను పేరఁబరఁగు ధరావిభుఁడ. ఎండిన చెట్టునైనను జిగిరించి యెలర్చుగీతి మనోహరగానమున నీయుమానాథు స్తుతించుచు దిక్కులనెల్ల మిఱుమిట్లు మించుతేజమున విలసిల్లు నీవెవ్వరవు? (స్వగతము( హృదయమా! సంభ్రమింపకుము. అయ్యో! ఈతరుణీమణి తానెవ్వరని చెప్పనున్నదోగదా?

మోహి—రాజేంద్రా! నేనెవ్వరైనదియు నెఱిఁగి కార్యమేమి? జనసంచారములేని యీ శైలభూమి భాసిల్లు నీయిష్టకామేశుపూజకే తెంచియున్నదాన. నిక్కడను జనసంచారముంచుభంగి యెఱిఁగితి. రాజేంద్రా! నీవిక్కడకేలవచ్చితివి?

రుక్మా—కామినీ! నేను నేఁడు క్రొత్తగా వచ్చినవాఁడనుగాను. ఇప్పుడు బహుదినములనుండి ప్రతియయనుసంవత్సరములకొకసారి శివరాత్రినాఁడీదేవునకునయుత

ఘటాభిషేకము జేయుచుండుటచే మొన్న శివరాత్రి యభిషేకమునకు శివదర్శనమున కేతెంచితి. భామామణీ! నీవు దేవ వనిత వేయగుదువు కాని యితరము కాదు. ఈ రొయొషకు దేవత లెవ్వరును వచ్చినవారి సందర్శించి రోయుచుఁగ అనుగ్రహించి చెప్పుము నీ వెవ్వరవు? ఏల యిక్కడకు వచ్చితివి?

మోహి—రాజచంద్రా! నేను మోహిని యను పేరఁబరఁగు నప్సరసను. నేనును దేవదర్శనమునకై—

రుక్మా—మహా! కాంతామణీ! నీ వప్సరసవు కాకుండిన నొకులకు నిట్టి రూపవైభవముండు నే? నీసందర్శనము లభించుటకు నెన్ని యజ్ఞములో యొనర్పవలయుఁగదా? నే నెంత ధన్యుఁడ నైతిని! రమణీ! మనసున నున్నమాట నిక్కముగా వచింతునా? నిన్ను జూచినప్పటినుండియు నెనలేని వ్యామోహము నాకుఁగలిగె. నీవనుగ్రహింపకున్న నాజన్మమే నాకువలవని నిస్పృహ జనింపఁగలదు. అనుగ్రహించి నీ యాశ్లేష సుఖము నాకు నొసఁగుదువా?

మోహి—(స్వగతము) ఒక్కింత వేళ యొనర్చెద. (ప్రకాశము) రాజేంద్రా! ఇదియా పురుషులమాట? ఎన్నఁడును జూడక యాకస్మికముగఁ జూచినంతనే మోహించుచు, మోహించుటయే కాక మోహించితినని కొంకు లేక వచించుచుఁ దారతమ్యముగణింపక యీతీరున సరసపు మాటలాడుట రాజధర్మమా?

రుక్మా—రమణీ! నీయాన నిక్కము వచించెద నిన్ను మోహింపకుండుటకు నిన్ను దర్శించిన పురుషుల కెవ్వరికైన సాధ్యమగునా? నిన్నుఁ జూచినప్పుడే నాకు దిగ్భ్రమముగలిగి పరవశత ప్రాప్తించె.

సీ. చక్రవాకులమించు సవతుగాదనిపించు
వలిగుబ్బచనుదోయి చెలువు చూచి
నిండుచందురుకాంతి నిరసించునల్లంత
మొలకనవ్వులముద్దుమోము చూచి
యింద్రనీలపుకంగు నెరపుసేయఁగడంగు
కుటిలకుంతలములకొమరు చూచి
మరుబాణములయేపు నెరపుసేయఁగనోపు
నిడువాలు గన్నులకడిమి చూచి

గీ. పొలపుమీఱిన నెలవంక బొమలఁ జూచి
రమణఁదళుకొత్తుబింబాధరంబు చూచి
తలిరులనుబోలుమృదుహస్తములను జూచి
పలవ కుండంగ నెంతటివాఁడ నబల.

నీ వెవ్వరి వనితవో! యెవ్వరి గృహిణివగుదువో యను సంశయము వొడమినందునఁ బాప భయమున మేనునఁదొట్రుపాటుగలిగె. నీవచ్చర వై యుండఁగూడ దాయని మిక్కిలి కోరితి. నీవప్సరవేయై యుండుట నాభాగ్యమేకదా! పౌండరీకాది యజ్ఞములొనర్చినవారికిని ఘోరయుద్ధమున మరణముఁ జెందినవారికిని గాక నినుబోలు నప్సరల సహవర్తనము లభింపదనుట నే నెఱుఁగుదును. అయినను మదనువాఁడి బాణములవాడి కోర్వఁజాలక యీప్రార్థన మొనరించెద. రమ్ము. నన్ను ధన్యుఁ జేయుము. నాకుఁగల యైశ్వర్యమునెల్ల నీస్వత్వముగానే భావించి నా కేలిక సానివి తమ్ము. రమణీ! నీవు తడసిన నేనోర్వ.

చ. మొకరిపి సాళితుమ్మెదలమూఁకకు గందపుగాలి రాకకున్
మకరపతాకుఢాకకును మామిడి మోకకుఁ జంద్రు కాకకున్
బికముల వీఁకకున్ సిరులఁ బేర్చినయామని యిచ్చునీకకున్
జకితమృగాక్షి యోర్వ నిఁకఁజాలఁగృపామతి నాదరింపుమా.

కుసుమ కోదండుఁడు మననీఁడు. ఏదీ! నీమనోహరాలింగనమిమ్ము.

మోహి—రాజేంద్రా! ఇట్లొనర్చుటవలన నీగౌరవమునకు హానికలుగదా? కన్న వారు కైవీఁచి పిలిచినంత నే కలయఁగల కామిని యంచు నన్నెంచితివా? ఊరకుం డుము. నాకుఁ గోపముగలుగు. నాదారిని బోనిమ్ము.

రుక్మా—మారనారచములఁదూలి కడ గానని యాపదఁ బాణములఁద్యజింపనున్న నన్ను నీయధరామృత పానమునఁజేసి రక్షించుటకంటె నీ కింకొక దారిగలదా? కామినీ! నన్నుఁ దొఁడకుము. అరగంటఁ జూడకుము. నిన్నే నమ్మియున్నాను. నీకంటె నితర మెఱుంగను. నాకుఁ గలవన్నియు నీకే యర్పించెద.

మోహి—ధరణీధవా! నన్నిట్లు బాధపెట్టసాగితివి. దేవలోకమున విచ్చలవిడిగాఁ దిరు గాడుచు దేవేంద్రు ననుగ్రహమునకుఁ బాత్రులమైయున్న నన్నుఁ బోలినయచ్చరలు భూమికిదిగి నీవెంత రాజ వైనను నిన్నుఁబోలిన యొక్కరివశమున మెలఁగుటదగునా? ఏల నాలవేలుని కోరికలు? నన్ను విడువుము. నీకు శుభమగును. పోయివచ్చెద.

రుక్మా—తరుణీ జనవతంసమా! నీకిట్టి నిర్దయయుండునే? నీవనుగ్రహింపకున్నఁ బ్రాణములు బాయుదుమనని చెప్పుమాట యతిశయోక్తిగాదు. ఔపచారికము గాదు. నా యాన నిక్కము. ఏల నన్ను నిరాదరణ మొనర్చి పోవనెంచెదవు.

## అనుబంధము 11.

నిన్ను నమ్మిన యొక ప్రాణిని బ్రాణాపాయమువలనఁ దప్పించుటకు నింత యుపేక్షయా? నీ చరణములంటి వేఁడెదను. నిను మానను.

మోహి—ఆహా! రాజన్యా! ఇదియేమి నీయుపేక్ష? దేవవనితనైన నేను నీతో నెట్లు మెలఁగనేర్తు. అంతఃపురమున నెందఱో నీకుఁ దరుణులున్నవారే వారి కనుచర భావమున నేనెట్లుండనేర్తు? ఇది కానిపని. నీకుఁ దెలియదా? ఊరక దేవదర్శన మొనర్చి నీదారిఁ బొమ్ము.

రుక్మా—రమణీమణీ! నీవె నన్నింత కటాక్షించితివా! నాయువతులఁ బుత్రుని నా సర్వస్వము నీయాధీన మొనర్చువాఁడ. నీమాట జవదాఁటక మెలఁగువాఁడ.

మోహి—రాజేంద్రా! మోహమునఁ గన్నుగానక కార్యసాధనమునకై యేమేమో వచియింపవచ్చుఁగాని యవియన్నియు జరుపుటకగునా? నీవపేక్షించినది క్షణిక సౌఖ్యము. అది లభించిన వెంటనే యభిలాషలన్నియుఁ గడముట్టఁబోవు. తరువాత నొకవిధమగు మోహముండఁగలదా? ఏల తెలియనిభంగి మాటలాడెదవు? అన్న మాటంతయు నీకు జరుపుటకు సాధ్యమగునా?

రుక్మా—కామినీ! నాసముద్దేశము సంశయించిన మాటలాడి నీవు నాకెంతయు దప్పొనర్చితివి. అదే! అందున్న యిష్టకామేశు పాదపద్మములాన వచించెద. నీమాట నేజవదాఁటువాఁడఁగాను. ఏల నన్నింత పరీక్షించెదవు? నను నీకృపకుఁ బాత్రునిగాఁ జేయుమా?

మోహి—నరణీవరా! నీకెందఱో తరుణులుందురే? పుత్రుఁడును నున్నవాఁడని నీవాడిన మాటవలనఁ దెలిసె. నీదారలతోఁ గల యుపభోగము చాలదా? చూచిన వారి నెల్లను రూపవతులైన మాత్రముననే యేమి? ఇటు కలయఁగోరుట ధర్మమా? ఈయాచరణము నీభార్యలు సమ్మతింతురే? నీకుసుఖమా? నాకుసుఖమా? వదలుము నీకోరిక.

రుక్మా—మోహినీ! నాభార్యలెల్ల నేఁగోరినవెంటనే నీకుఁజరణదాసులు గానుండుటకు నామోదింపఁ గలరు. నాపుత్రుఁడు నీపుత్రుఁడే యగుఁగదా? ఇంకేల నీవిషమ పరీక్ష? ఎట్లును నను గృతార్థుఁజేయక నీకుఁ దప్పదు. ఆపరమేశునాన వచించెదను. నిన్నుమానిన వనితాంతరప్రసక్తి నే నిచ్ఛయింపను.

మోహి—పరమేశా! ఇష్టకామేశా! నినుదర్శించి పూజయొనరింప వచ్చియున్న నాకు నెట్టి తగులము ఘటించితివి?

రుక్మా—వనితామణీ! ఇంకఁ దామసింపకుము. నన్ననుగ్రహింపుము. పూర్ణాభిలాష వశమున వాంఛించిన నీకౌఁగిలి దయచేయుము.

మోహి—అయిన నీవు నన్ను విడువవు?

రుక్మా—నిన్ను విడుచుటకా యింత నేపునుండి నేనిట్లు ప్రార్థించుట?

మోహి—రాజచంద్రా! అప్సరసలగు మాకు మానవసహవాసము నూతనము కాదు. అయిన నన్ను నీవు గారవించినన్ని నాళ్లును వనితాంతర ప్రసక్తి నీవు మానెదవనియు నాయాజ్ఞ నీవ్రుంచఁగలవాఁడనియు నీవు నమ్మకమగు ప్రమాణమొసంగితివా నేను నీమాటకు సమ్మతింతును.

రుక్మా—(మోహిని చేతులుపట్టుకొని) రమణీ! నన్ను గృతార్థుఁజేసితివి. నను ధన్యుఁజేసితివి. నీ వేరీతిఁ బ్రమాణము చేయుమన్నను జేయుదును. నాపుత్రునాన వచించెదను అదే! ఆలయమునను న్న యిష్టకామేశునాన బాసఁజేయువాఁడ. నీవు నన్ననుగ్రహించినన్ని నాళ్లు పెఱవనితలఁ గాంక్షింప. నీ వేమిమాట చెప్పినను నింతకంతైన జవదాఁటక జరుపువాఁడ. ఇంకనైనను నన్ను నమ్మితివా? నీయాలింగనము నేయాజ్ఞించితినని యెంచవచ్చునా? (ఆలింగనము చేసికొనఁబోవ).

మోహి—(తప్పించుకొని దూరముపోయి) నిలు మింత త్వరయేల? నీవు ప్రమాణవాక్యము నాయిష్టకామేశునొద్దనే వచియింపుము. పిదప నూరికిఁబోయి నీవచనముల కన్నటికి నామోదించితినని నీపట్టమహిషి యెవ్వరో యామెతోడను నీపుత్రవతియగు నీ కాంతతోడను బలికింపుము. పిదప నీయిష్టానువర్తనమున నేనుందుదాన.

రుక్మా—రమణీ! సమధిక వ్యామోహమునఁ దల్లడిల్లుచున్న నన్ను నీ వేమి పరీక్ష చేసినను నెట్టి ప్రమాణము గోరినను సమ్మతించువాఁడనే. అయిన మఱల నూరికిఁబోయి పుత్రవతి యగు నాయగ్రమహిషి తోడను సమ్మతించినమాట పలికించువఱకు నీ యాలింగనమునకు నంతరాయము కల్పించితివే యిదెట్లు సహింతును?

అనుబంధము 12

మోహి—నీవు నన్ను జూచి చూడకముందే యింత మోహపుమాటలాడితివి. నీ మోహము క్షణభంగురమగు నేమో యనుభీతిచే నీకింతవకాశమిచ్చితి. అదిగాక తత్కాలమున నుద్భవించిన యంధమోహమున నీవు నను జేపట్టుట నీమహిషి కయిష్టమైన నప్పుడు మానడుమ నీకెట్టి దుస్థితియు నెట్టి దుఃఖమును గలుగఁగలదో నీ వెఱుఁగ నేరవా? అది నీకు లేకుండఁ జేయుటకును నీసమయము నభిలషించితి.

రుక్మా—కానిమ్ము. నీయిచ్ఛచొప్పున నెఱవేర్చెద. నీవెట్లును నీయిష్టానువర్తనమున మెలఁగ నెంచియున్న నన్ను నీ వెట్లేలుకొన్నను విహితమేకదా? పోదము రమ్ము స్వామి దర్శనమునకు. (లోనికిఁబోయి) మోహినీ ఈవరమేశు నెదుటఁ బ్రమాణము చేయుమన్న నీయపేక్ష నిర్వహించెదను.

మోహి—నాథా! నాకేనియుఁబ్రమాణమువలదు. నీమాటకంటె నిదియొక యెక్కువయా? ఊరక నీమనసరయఁగోరి యడిగితిఁగాక. నీవు మాటయిచ్చి యుండినదే చాలు.

రుక్మాం—మనోహారిణీ! నీవెట్టి యుదార దయాగుణభూషణవు. నిన్ను జేపట్టుట నాకెంత ధన్యత. నీవు వలదన్న మానితిఁగాక నే నాడిన మాటకంటె నీయెడ నొనర్చు ప్రమాణము నాకెక్కువ యగుపించదు. చెప్పినది చెప్పిరేయున్నాను. మనకింత సమ్మదమావహింపఁ జేసిన యీయుమామనోహరు నిష్టకామేశు మతింతము.

సీ. దంభోళిధరసతీ తాంబూలవేటీషు
దహనబింబాధరీస్తనభరేషు
శమనశుద్ధాంతయోషాఫాలభాగేషు
నిఋతిసాక్షీముఖనీరజేషు
కంధినాయకబాలికాకర్ణపత్రేషు
గంధవహాంగనాకచభరేషు
రాజరాజాంతఃపురస్త్రీకరాగ్రేషు
కరకంఠభామినీకటితటేషు
గీ. చంద్రశకలంతి హారంతి చందనంతి
విశదహాసంతి హీరంతి విచికిలంతి
దర్పణంతి దుకూలంతి తవయశాంసి
క్లేశభవభంగ యిష్టకామేశలింగ.
సీ. కోటిమన్మథరూప హాటకాచలచాప
చటులబాహాటోప శరణుశరణు
శ్రుతిచతుష్టయఘోట శుభ్రగంగాజూట
జలజాసనకరోట శరణుశరణు
వ్యాఘ్రాసురధ్వంస వర్ణితమీమాంస
చంద్రఖండవతంస శరణుశరణు
భుజగేంద్రకేయూర భువనత్రయాధార
సద్భక్తమందార శరణుశరణు

గీ. సతతకరుణాఘనాపాంగ శరణు శరణు
సామజాసురమదభంగ శరణు శరణు
శైలకన్యామనస్సంగ శరణు శరణు
శరణు విశ్వేశశివలింగ శరణు శరణు.

మోహిని—(ముందటికివచ్చి స్వగతము) ఆహా! ఈరాజవరుపై నాకెంత మోహము జనించినది. ఈయనకుఁగల దైవభక్తియుఁ స్తోత్రసై పుణ్యమును జూచి నవకాశము కలిగినంతనే నాయెడ మోహ మెక్కడ తిరుగునో యను భీతి నాకు జనించుచున్నది. అట్లతఁడు ప్రీతి మరలించిననే నెట్లోర్వఁగలదానను? ఏమిచేయుదును? (ప్రకాశము) రాజేంద్రా! ఏమేమో దీర్ఘాలోచన చేయునట్లున్నావు.

రుక్మా—ఏమియు లేదు. నావీనులకు జల్లఁగ నాథా యని సంభోధించితివి కాని నీకౌఁగిలియైన నొక ముద్దయిన నాకీక మసలఁ జేసితివేయని చింతించుచుఁ దీఱని యభిలాష వశమున నిన్నడుగుదునా వలదాయని యోచించుకొనుచుంటిని.

మోహి—కౌఁగిలికి ముద్దునకు మాత్రమా నాథా! నన్నింత యాచింపవలయునా! నీవపేక్షించిన కార్యమెల్ల నేనును నొనర్పవలసిన దానఁనేగదా?

రుక్మా—అట్లయిననే ధన్యుఁడ. కడుధన్యుఁడ. (అని యాలింగనముచేసి ముద్దిడును.)

(యవనికపడును).



## చతుర్థాఙ్కము-ద్వితీయరంగము.

—∘∘⊰❦⊱∘∘—

### రుక్మాంగదు నంతఃపురము.

[ ప్ర: కోమల-చంద్రకాంత (రుక్మాంగదుని భార్యలు) ]

చంద్ర—కోమలా! ఇంక మనమెట్లు సహింపవలయును? ఎంత వేఁడికొన్నను రాజన్యుఁడు తిరుగువాఁడా? ఆ కాంతకు మరులుగొని ఘోరప్రమాణ మొనర్చియున్నాఁడు. దీనికేమి చేయుందము?

కోమల—చంద్రకాంతా! దీని నూరక యిట్లే పోవనిచ్చిన బ్రతికినన్నాళ్లమనకుదుఃఖము గదే! రాజునకు భోగినులెందఱో యుందురుగాక యెవ్వతెయైనను నితరుఁ గలియఁగూడదని ప్రమాణము చేయించుకొనునే? దేవతలలోని వెలయాలగు నా కామిని కిట్టి సాహసా మొదవెఁగాక.

చంద్ర—కోమలా! మనమిప్పుడు మనోదార్ఢ్యముఁ జూపకున్న మనకార్యమంతయుఁ జెడిపోవు. మనమెల్ల విజృంభించిన మమ్ము మాత్రము మీఱఁగలవాఁడాయా రాజేంద్రుఁడు? తుదకామోహినియే భీతిఁజెంది కీళవళించి పరువెత్తునట్లు చేయఁజాలమా?

కోమల—చంద్రకాంతా! మనమెల్లనీరాజేంద్రునగ్రమహిషి యగు సంధ్యావళినిమున్నిడుకొని ప్రయత్న మొనర్చితిమా కార్యసాధనము కాఁగలదు. ఆయమ యేమిచెప్పునో యరయుదము. అదే యాయంతఃపురమున నయ్యోడనే యాయమకనుపించుచున్నది. పోయి విచారింతమురమ్ము. (అని యిరువురును రంగము ముందటికి వచ్చెదరు.)

[ ప్ర: సంధ్యావళి.]

చంద్ర }
కోమ } అక్కా! సేవించెదము (నమస్కరింతురు)

సంధ్యా—వారినిరువురిని నాలింగముఁ జేసికొని) చెల్లియలారా! సుఖమున్నారా?

కోమల—అయ్యో! ఎట్లు సుఖము జనింపఁగలదు?

సంధ్యా—వీల యిట్లాడెదరు?

చంద్ర—అక్కా! ఏమియు వినలేదా? మననాథుఁడు నీ యొద్ద కింకనురాలేదా? వృత్తాంత మేమియు వినలేదా?

సంధ్యా—ఏమి? ఏమి? నాథుని కేమైన నాపదగలిగెనా? సుఖముగ నున్నాఁడని యింతకుముందు వింటినే!

చంద్ర—అక్కా! అట్లయిన నీ వెఱుఁగవు. సవిస్తరముగా వివరించెద. మననాథుఁ డిష్టకామేశుసేవకుఁ బోయియున్న కాలమున మోహినియను నప్సరను దిలకించెనఁట. మోహించెనఁట. ఆతాఁగ తన్నుమానిన వనితాంతరప్రసంగము విభునకుఁ గలుగ రాదనియుఁ దనమాట నెన్నఁడును జవదాఁటరాదనియు, విభునితోఁ బ్రమాణ మొనరించి, తన పాణిగ్రహణమునకు నీవు ముఖ్యముగ సమ్మతింపవలయుననియు, నీసమ్మతి వడసినపిదపనే పాణిగ్రహణముగావింపవలయుననియు నింతయన ర్థముజరిపియున్నది. మా ప్రాణములు మా భాగ్యమంతయు నిప్పుడు నీచేనున్నది. నీవు మాత్రము సమ్మతింపక పోతివా యా మోహిని చప్పరిముఖమున వచ్చిన దారి పట్టుకొని యూరేగి పోవఁగలదు. దృఢమానసముననీ కార్య మొనర్పవలయుననినీచరణములపైఁ బడి వేఁడువారము. (ఇరువురును నమస్కరింతురు).

సంధ్యా—ఎవ్వరుచెప్పిరిమీకింత వృత్తాంతము?

చంద్ర—ఒకరని చెప్పుదు నా? ఊరంతయు నీ గజిబిజి నిండినది. నా దాసివలన నీ వృత్తాంతమంతయు నే నెఱిఁగితి.

సంధ్యా—నిక్కమే యుండవచ్చును. మననాథుఁడూరికి మఱలివచ్చి రెండుదినములు కావచ్చినను, దన శుభదర్శనము నాకొసంగ కున్నాఁడు. బాలుని ధర్మాంగదు మాత్ర మింతకుముందుఁ బిలిపించుకొనియుండె. ఆబాలుఁడును నాయనగారితోఁ జెప్పఁ గూడని చక్కదనముగల యొక కాంత వచ్చి యున్నదనియు నాయను నాకు బినతల్లియని చెప్పిరనియు నాతోఁ జెప్పె. నాయొద్దకు సంకోచము తోడ నే రాకున్నాఁడని యిప్పుడు తోఁచుచున్నది.

చంద్ర—అక్కా! చెప్పితిమే అంతయు నీచేతనున్నది. నేఁడో-రేపో నాథుఁడు నీసమ్మతి యడుగ రావచ్చును నీవుమాత్రమీయకుండుము.

సంధ్యా—చెలులారా! మీకేమజ్ఞాన మిట్టిమాటలాడెదరు? నాథుఁ డపేక్షించిన కోరిక జరుపుటకంటె సతికింకొక్క పనిగలదా? అతఁడాజ్ఞయిడిన భంగి జరుపకున్న నది పాతివ్రత్యమునకే భంగము గలిగించుఁగదా? యోచింపుఁడు. మీరు చెప్పునట్లొనర్చుట కానిపని. అవశ్యము నా సమ్మతి యొసఁగెద.

కోమల—అయ్యో! సోదరీ! ఎవతెయేకానితానువిభునకు మెచ్చులాఁడియైనఁగావలసిన సౌఖ్యములు, వేఱభిలాషములన్నియుఁ గలిగించుకొనవచ్చుఁగానివిభునిశరీరమునకుఁదనకంటె హెచ్చగు స్వాతంత్ర్యము గల యతని భార్యల యొద్దకుఁ బోవరాదని ప్రమాణము చేయించుకొను నే. అదియొక్కసతియా? దానియెడఁగృపఁజూపవచ్చునా?

పతివ్రతయగు భామినియిట్టిఘోరప్రమాణముఁ గోరునే? కన్నవారిఁ గలయు వేశ్య యగుటచేఁగదా యిది యింత సాహసమున కుద్యమించినది ?

సంధ్యా— చెలులారా! మీరెల్లఁ దప్పక పొరపడితిరి. మన నాథుని మోహము నాశ్రయించె నేయని యీకాంత యెడఁగలిగిన యీర్ష్యచే నిట్లాడెదరు గాక యొక్కించుక యుక్తాయుక్తములఁ బరిశీలించితిరా మీకుఁ బశ్చాత్తాపబుద్ధి కలుగకపోదు. ఆ తన్వి ప్రమాణము కోరినది యెట్లుండినను మననాథుఁడు ప్రమాణము నిచ్చినదిగదా ముఖ్యము. నా సమ్మతి యిప్పించెదనని ప్రభుఁ డెంతయో ప్రీతితో నిచ్చినమాట తప్పఁజేయ దగునా? నాపై నెంత ప్రీతియో నాయెడ నెంత విశ్వాసమో యుండకున్న నాథుఁ డామాటఁ జెప్పియుండునా? ఆ విశ్వాసమునకు నేనై భంగము దెచ్చుకొందునా? అది యటుండనిండు. ఏవేళయందుఁగాని యెట్టికార్యము పట్టఁగాని నాథుఁ డేమభిలషించినను నామాట నడపుట పతివ్రతయగు మానినికిఁ దీరాని పని. అందునకుఁ దప్పి పాతివ్రత్యమునకు భంగముఁ దెచ్చుకొందునా? నాచేతఁగాదు. నా పరిహరణమునకు నే నవశ్యము సమ్మతించెద. మీరిఁకఁ గొండాడకుఁడు.

కోమల— అక్కా! నీ వేమో మాటలాడెదవుగాని, విశ్వాస భంగముగాని పాతివ్రత్య భంగముగాని దీనివలన నెట్లు సిద్ధించును? నీవు సమ్మతిమాటయిచ్చుటకును నీయకుండుటకును స్వాతంత్ర్యము నీకు లేదా? అట్టిచో నేను సమ్మతింపనని చెప్పిన, నేమాత్రమును దోషము గలుగదు. నాథునిమాట జరుపలేకపోయిన దోషము సిద్ధించునని నీవాడ నెంచితివా? కానిమ్ము. ఆదోషము నీవు సమ్మతించుటవలన రాఁగల ఫలముతోఁ దులఁదూఁగఁజేయుము. ఏది యెక్కువగునో? ఆఫలము మహాఘోరము. నీయంతకు నీవై పతివియోగము ఘటించుకొని యంగలార్చుటొకటి. అట్టి వియోగము లభింప నున్నప్పుడు పతియుండియు లేనివాఁడే యగుఁగదా? అది వైధవ్యమున కంటె నికృష్టస్థితియని నేనెంచెద. అది యటుండ నీతోఁగూడ నాకు నితర యువతుల కంతయు వియోగము ఘటిల్లఁజేయుఫలము నీ వరయలేనైతివే? ఈదుర్విధి యెక్కువగునా? ద్రోహకాంతచే నొక వేశ్య యుపదేశించిన మాటపై యుక్తాయుక్తములరయక తత్పాణిగ్రహణ దుష్కార్యమునకు నీసమ్మతి యడుగవచ్చినప్పుడు వలదనుటవలనఁ గలిగెడు దోషమెక్కువగునా? అయ్యో! ఇంతరయలేవే? అనుగ్రహించి మామాట పాటింపుము.

సంధ్యా— తరుణీమణులారా! మఱియొకమాట మీరే యోచించుకొనుఁడు. పాతివ్రత్యమట్లుండఁగాక యీమోహినిపై నెంతయో తీఱగాని యభిలాష లేకున్న మననాథుఁ డట్టి ప్రమాణముఁ జేసియుండునా? నే సమ్మతి యొసంగని కారణమున నయ్యభిలాష తీఱకున్న నతని మనసెంత నొచ్చునో? అతని కెట్టి యాపద గలుగనో? అది

కొంచెము విచారింప వలయునుగదా? నాథుని కష్టమైన నాపదగలిగిన మనమెవ్వరు గాని భరింపఁగలమా?

## అనుబంధము 14.

కోమల—అక్కా! నీవూరక లేనిభీతి తెచ్చిపెట్టుకొనియెదవు. ఏమో సమయ దోషమున మోహము పుట్టియుండె, నప్పటి కేదో ప్రమాణ మొసంగెఁగాని యామోహినిలభింపకపోయిన మనవిభుని కట్టి యాపదలైన రాఁగారణములేమి? అది వెడలి పోయినంత నేయొక వేళనొకటిరెండుదినములు కొంచెము మనోవికారము కలుగవచ్చునని యెంచుకొన్నను నచిరకాలమున నేయది యంతయు మఱచిపోఁగలఁడు. ఇట్టిపనికి సాహసించి సామాన్య వేశ్య లభింపకపోయినంత నే లోకము మునిఁగినట్లెంచునా?

సంధ్యా—అక్కలారా! మీరించుక యోచించుకొనుఁడు. ఆమోహిని సామాన్య వేశ్య యంటిరి. ఎంతపనికైన సాహసింపఁగలది యంటిరి. ఒకవేళ నాథుని మాటకు నే సమ్మతింపకున్న నాకాంత మనస్సుత్రిప్పి తన పాణిగ్రహణమునకు నా సమ్మతి లేకున్నను నొప్పికొని విభుని చెట్టపట్టుట కభ్యంతర మేమైన నున్నదా? అప్పుడు నే నెట్టిదాన నగుదును? విభుని మాట త్రోసివేయుటగాక విభుని మనసున వంత జనించు కార్య మొనర్చినదగుటగాక యింకెన్నఁటికిని విభుని ప్రేమవడయుటకర్హత లేని దాననగుదు. ఆమోహిని నామనసు మరియుఁగొంత సమ్మతియను నెపము గల్పించి యుండినను గల్పించియుండవచ్చుఁగదా? దానికి నేనై చెడుతనము దెచ్చుకొందునా? మననాథుఁ డొకవేళ నేకారణము లేకయే మమ్ముఁ గన్నెత్తి చూడక నిరాదరణ మొనర్చిన మన మేమొనర్పఁగలవారము? నే సమ్మతి యీకున్నఁ గారణము లేని నిరాదరణమునకుఁ గారణ మొకటి కల్పించి యిచ్చినట్లగు. సమ్మతియిచ్చిన పిదప నెప్పుడైన నామోహినికేయనుగ్రహము గలిగి మఱల మనవిభుఁడు మమ్ము నాదరించుటకు నాస్పదము కలుగవచ్చును. కాని సమ్మతియివ్వకున్న నామోహిని కరుణించినను విభుని యనుగ్రహము వడయుట దుస్తరము. తరుణీమణులారా! యోచించుకొండి యూరక సమ్మతించుటకు నెన్నియో కారణములు కనఁబడుచున్నవి. చూచితిరా! నాథుఁ డిప్పటికి వచ్చి రెండుదినములైయుండియుం నాసమ్మతి వడయుటకైన ననుఁ జూడరాకున్నాఁడు. ఆమాట నుడుగుటకుఁ గొంకి కర్తవ్యము లేక యోచించుచున్నాఁడు. నాథునకిట్టి తొందఱపాటు కలిగించుట నాకుఁ బాడియా? కాగితము లేఖినియు నిండు (అని యక్కడనున్న కాగితమును లేఖినియు గ్రహించి జాబు వ్రాయును).

కోమల—అక్కా! ఏమి జాబువ్రాసితివి?

సంధ్యా—(జాబు చదువును).

౬. సీ. అనఘులౌరుక్మాంగడావనీశ్వరులకు.
దమముఖ్యదాసిసంధ్యావళిసతి
చరణంబులకుమ్రొక్కి సలుపువిజ్ఞప్తులు
ప్రాణేశమీరువింధ్యాద్రిసీమ
మోహినీకాంతను మోహించుటయు నామె
వనితాంతరాసక్తి వదలుమనియు
దీనికినాసమ్మతినిబొందుమనియుఁబ్ర
మాణంబుగైకొన్నమాటవింటి

గీ. సంతసంబునిండెఁ జాలగౌరవమయ్యె
మీకుమదినిఁబ్రీతిమీఱనిదియె
లిఖితమూలమన్నలీల నాసమ్మతిఁ
బంపియున్నదానఁ బ్రాణనాథ.

నాథా! ఇష్టకామేశ్వర సన్నిధి నప్సరస్తరుణియగు మోహినీ కాంతకును నీకును గలిగిన సమయ నియమము నెల్ల వింటిని. ఆ కాంత నిన్నుఁ జేపట్టుటకు నాసమ్మతియొక్క నియమముగాఁ గోరియున్నదని వింటి. ఈ యాచరణము నాకెంతయు గౌరవము గలిగించి నందులకు సంతసించుచు నీవడుగుటకుముందే నాసమ్మతి యనఁగా నా మోహినీ కాంతఁ దప్ప నీ యితరకాంతలతో సంసర్గ మొనరింపకుండుటకు నే నొప్పుకొంటినను సమ్మతి నోటచెప్పుటకంటె వ్రాఁత మూలమున వచించుటయే యొప్పునని యీకమ్మ వ్రాసియున్నదాన.

నిరతము నిన్ను దైవముగా భజించు,

సంధ్యావళి."

చంద్రకాంతా! ఈకమ్మ యీక్షణమున నెవ్వరితోడ నైన మన నాథు నొద్దకుఁ బంపుము.

చంద్ర—అక్కా! కొంచెము యోచించుకొనుము.

సంధ్యా—అటులైన నే నెవ్వరితోడ నైనఁ బంపెదను.

చంద్ర—కోపగింపకుము. ఇట్లిమ్ము (జాబుతీసుకొని లోనికిఁబోవును).

కోమల—అక్కా! నీవొనరించినది యుక్తమనియే దీర్ఘాలోచన మొనర్చిన నాకుఁ దోఁచుచున్నది. ఇంకే కారణము కాకుండిన నీవు వచించిన తుదకారణము కలదు కదా యనియేమన్న మోహిని తరువాత నీసమ్మతివలదని చెప్పఁగల కారణము. అది మిక్కిలి సమర్థమైనదని నాకుఁ దోఁచుచున్నది.

సంధ్యా—అంతకంటె ముఖ్యకారణము నాథునాజ్ఞ జరుపుటయే. చెలియా! పాతి వ్రత్య ధర్మాచరణమున నెంతమేలు కలదు. సావిత్రిదేవి తన పాతివ్రత్య ప్రభావమున మృతపతిని బ్రతికించుకొనినది. ఇంక నంతకంటె నెక్కుడగు కార్యముకలదా?

[ పునః ప్రవేశము: చంద్రకాంత. ]

సంధ్యా—ఏ పితివా సఖియా! యాజాబును?

చంద్ర—అప్పుడే పంపితిని. నాథుఁడిందువచ్చునేమో యని నిరీక్షించుచు నింతవఱకు మసలితి.

సంధ్యా—నాథుఁడిందేల వచ్చుననుకొంటివి?

చంద్ర—వింధ్య ప్రాంతమునుండి మఱలివచ్చి నపిదప నిచ్చుఁ జూచుటకును, నీసమ్మతి వడయుటకును మొగము లేక యింతవఱకు దిక్కుతోఁచక సంకోచించు నాతనికి నీవాజాబుపంపుట తూఁగియాడు వానికిఁ బఱుపువేసియిచ్చినట్టయ్యెఁగదా? కాఁబట్టి పరుగెత్తివచ్చు ననుకొనుచుంటిని.

[ ప్రవే: మోహిని (వెలుపలి ప్రక్కని జాబు చేపట్టి) ]

మోహిని—(స్వగతము) ఆహా! ఇదియేమి ఋణానుబంధము! నాకృత్రిము మోహమంతయుయదార్థ మోహమైపరిణమించె. రుక్మాంగదు పట్టమహిషి సమ్మతిగోరియుంటిఁ గదా? అది యడుగుమనుటకే నాకు నోరెగయకుండె? నేనడిగివచ్చెదనని యా రాజేంద్రుఁడు వలుమాఱు చెప్పినను, నామె యొప్పదనియు నప్పుడు శంకరు సన్నిధానమున నొనర్చిన ప్రమాణమునకు భంగము కలిగిన నేనెక్కడ నతని మానిపోవల వచ్చునోయను భీతిచే నామనోహరు మంగళాంగ దర్శనమైన నిరంతరము నొనర్చు చుండుననియుఁ వలదనియాఁపుదు వచ్చితి. ఇప్పుడట్లడుగుటకుముందే సంధ్యావళీదేవి యీజాబు పంపవలయునన్న నెంత మహోదారగుణము? ఎంత పారమార్థికము? ఎంత పరోపకార పరత? ఎంత యాత్మతిరస్కారము? ఇట్టి మహోదారతిలకను దర్శించుకొననే వలయుఁగదా?

(లోపలి కేఁగుఁజూచి)

ఏమంటిదాసీ! అక్కడనే కూర్చుండియున్నారా? ఈముగ్గురిలో సంధ్యావళి యెవరు? ఓహో! ఆమధ్యనున్న యామెయా? మోము చూచిననే మహత్త్వము తెలియుఁగదా? (సమీపించి) సంధ్యావళీదేవీ!

సంధ్యా—(స్వ) ఆహా? ఎవ్వరీ తరుణీమణీ! చూడ్కికి మిఱుమిట్లు గొలుపుతేజముఁ గలిగియున్నదే? ఈమె మానవవనిత యగునా? దేవవనితయగునా?

మోహి—అమ్మా! ఈజాబే నీమహోదారగుణమంతయు నాకుఁజాటిచెప్పె. మీనాథుఁడు నాయొద్దనుండిన కాలమున మీదాసి తెచ్చియిచ్చె. అతఁడు నాచేతికిచ్చె. చదివితి. నీపరోపకారపారీణత నెఱిఁగితి. నిన్ను దర్శించుకొను కుతూహలము వొడమి నాథుని యనుమతిపడసి యేతెంచితి. నే మోహిని యను నచ్చర చేడియను.

సంధ్యా—(శీఘ్రగతిలేచి) అమ్మా! మోహినీదేవీ! నానాథునకి నంతనురాగముగలిగించిన నీవు నాకెంతయుఁ బూజనీయవు. అమ్మా! నీవీయెడకు రావలసియుండెనా? ఒక మాట చెప్పియంపియుండిన నే వచ్చియుందునే? నీయనుగ్రహవిశేషము మమ్మను మా నాథుని భాగ్యరాశియుంచె. దేవతలకైన భజనీయవైయున్న యప్సరస్తరుణివగు నీవు నాథునిజెట్టపట్ట వలయున్న, నతని భాగ్యవిశేషమే కాదా? ఇంక నీయట్టి దుర్లభ్యకాంతామణితో మాకెల్లరకు సపత్నీత్వము చేకూఱవలయునన్న మాభాగ్య మెంతనవచ్చును! కూర్చుండుము.

మోహి—(కూర్చుండి) అమ్మా! నిన్ను దర్శించుట నాకును భాగ్యోదయమే. నీవు వ్రాసినకమ్మ చూచినవెంటనే, నీయెడ నాకెంతెంతనరానిభక్తిపొడమె. నాతప్పు లున్న క్షమింపుము. వింధ్యప్రాంతముననున్న నిష్టకామేశు భజింపు వేళ నీనాథుని సంపర్శనము నాకు లభించె. ఎనలేని మోహాబ్ధి మునింగితి. ఊరక చెట్టపట్టక వని తాంతరప్రసక్తిమానుట యే కాకయటుమానుటకు నీసమ్మతివడయుట యొకసమయము గా నభిలషించి ప్రమాణముగైకొంటిని. ఒకయెడ మోహాతిరేకముచుమతి యొకయెడ నీవు సమ్మతింపకున్న బ్రమాణభంగమును నిష్టార్థభంగమునువగునను భీతియుబాధింపఁ దొడఁగుకాలమున నీకమ్మఁబంపి పుణ్యముగట్టుకొంటివి. ఒక సమ్మతియిచ్చితివి గదా? ఇంకొకసమ్మతి సముక్షమమున నిను వేఁడుటకై నేనువచ్చితి. అదియేమన్న—

సంధ్యా—అమ్మా! సమ్మతియుం నీపనకును నీయాజ్ఞయేమైనను నెఱవేర్చెదను. నీవడుగుటకుముందే యది యెట్టిదయినను నాయంగీకారమున్నట్లె నమ్మును.

మోహి—అట్లయిన ధన్యనైతి. నాప్రార్థన వచించెదను. స్వామి సన్నిధిఁ బ్రమాణ మొనర్చియున్నందున నీసమ్మతిపడయక నాథుని పాణివట్టుటకు శక్యముకాకుండెఁ గాక యది నెఱవేర్చినపిదప నాకూరిరసమయము నే మానుటకు నాకుఁబూర్ణస్వాతంత్ర్యము గలిగె? కావున నే దండనుండువఱకు వనితాంతర ప్రసక్తి మాన

వలయునన్న సమయము నేనై వదలుకొనెద నన్ను మీలోఁ జేరనదానిఁగాఁదలంచి మనయందటి యెడ నేకరీతి గా మననాథుఁడు వర్తించుటకు నీసమ్మతి కావలయునని ప్రార్థించుదాన.

కోమ }
చంద్ర } (మోహినికి నమస్కరించి) అమ్మా! మోహినీదేవి! నీవు మాతల్లివి. మమ్ము నానంద పయోరాశి ముంచితివి.

సంధ్యా—కాంతాలలామా! నీ కెంత మహోదారగుణము! మాయెడ నక్కటికము కలిగి ప్రమాణము నైన మఱలించి యింతకు గ్రహించితివే! ఎంతటి ధీరగుణము! మమ్ము నీ చెల్లెండ్రఁగా దాసులఁగా నేలిన నదియే మాకుఁ బరమార్థము.

అనుబంధము 15.

(యవనికదిగజారును.)



## చతుర్థాఙ్కము తృతీయరంగము.

---

### ఉద్యానవనము.

[ ప్ర: మోహిని-రుక్మాంగదుఁడు. ]

రుక్మా—అలివేణీ! చూడు మిప్పుడే సాయంకాలమగుచువచ్చె. ఆచక్రవాక దంపతులకు లభింపనున్న వియోగమునకై యవి యిప్పుడే తపించునటులున్నది.

మోహి—నాథా! ఇప్పుడు వచ్చినట్టున్నదే మనమీ యుద్యానవనమునకు! మధ్యాహ్నమున వచ్చితిమి. అప్పుడే సాయంకాలమయ్యెనా?

రుక్మా—మోహానుబంధమున్నందున మనకుఁ బ్రొద్దే తెలియదయ్యె. ఈప్రొద్దుచేత మన మోహము మఱింతయు గ్రుడ్డివారిగా నొనర్చినది.

మోహి—అటుగాదు. మన మొక్కయాట యాడితిమిగదా? దానివలనఁ బ్రొద్దు తోఁచకపోయినది.

(లోపల భేరీధ్వని.)

నాథా! ఏమి భేరి మ్రోయుచున్నది? ఇదేమి రణభేరియా?

రుక్మా—కామినీ! ఇంక మూఁడు దినములు నన్ను విడువుము. ఈదినము దశమి. సాయంకాలమైనది గనుక నేకాదశీ వ్రత నియమమును బాటించుచున్నారు. ఇప్పటినుండి విష్ణుధ్యాన మొనర్పవలయు. రాత్రి భోజనము లేదు. రేపంతయు నుపవాసము. రాత్రి జాగరము మఱునాఁడు సూర్యోదయమునకే పారణ. పగలంతయు నిద్ర లేకుండ నుండవలయు. మఱల రాత్రిభోజనము వర్జింపవలయు. ఈ మూఁడు రాత్రులును నీవియోగము నాకెంత చింత ఘటిల్లఁజేసినను హరివాసర వ్రత నిష్ఠ మానని నాకు విధిలేదు. ఇప్పటికిదియే కడముద్దుగానుండుఁగాక (అని యాలింగనము చేసికొని ముద్దిడఁబోవ)

మోహి—(దూరముపోయి) నాథా! ఇదియేమి పిడుగుపాటు తెచ్చితివి! ఇట్టివ్రతమెందైనఁగలదా? నీవేమో సులభముగ మూఁడు దినములంటివి. అవినాకు మూఁడు యుగములౌట విచారింపవైతివే? సర్వసుఖము లనుభవింప నాస్పదము కలిగించునట్టి వయసున్న కాలమున నేమేకాదశి? విడువుము. ముసలితనము వచ్చినప్పుడేకాదశి నియమము లన్నియు నింక రెండునాళ్లెక్కువగా నుపవాసముండియైన నడపింతువఁట. ఇప్పుడేటికి వదలము. నాకొఁగిటికేరమ్ము.

రుక్మా—మోహినీ! నేనెట్టి మాటకైనఁ దాఁటదుఁగాక, యీవ్రతమును మాత్రము నీవు చులుకనగ మాటలాడితివా నేనోర్వను.

మోహి—ఇదియా నీపరవశము? సుఖరీతి దేవలోకమున మెలఁగుచున్న నాకు లేని యాశలు కల్పించి, లెక్కలేని ప్రమాణములు చేసి యిటు కొనివచ్చినది నీ వేకాదశీ వ్రత మొనర్చి నీశరీరము శుష్కింపఁ జేసికొని నామోహము శుష్కింపఁజేయుటకా? ఇది నేనుమాత్ర మెట్లోర్తును? నాథా! ఏల యీభ్రాంతి? వదలుము. అలపూఁబాన్పుపై వినోదక్రీడల మెలఁగుదము రమ్ము.

రుక్మా—మోహినీ! ఇంకొండనకుము. ఇది నాచేతఁ గానిపని.

మోహి—రాజేంద్రా! నామాట లింతకైన జవదాఁటనని నాచెట్టపట్టితివే! ప్రమాణ మొనర్చితివే! పురుషులయొక్క మాటనిలుకడ యిప్పుడుగదా నాకుఁ దెలిసినది? ఘోరప్రమాణ మొనర్చి పదిదినములైనఁ గాలేదే?

రుక్మా—మనోహారిణీ! నీచరణముల పైఁబడి వేఁడికొందు. నన్ను మన్నింపకుమా? నీమాట యెట్టిదైన నొనర్తునని ప్రమాణ మొనర్చినది నిక్కమే. ఆ ప్రమాణమునకై నా ప్రాణమైన నాకంటె నెక్కువగు నేపదార్థమైన గొనంగెదఁగాని యీ యేకాదశీ వ్రతము మాత్ర ముజ్జగింపను. అనుగ్రహించి యీ యుద్దేశము మానుమా?

మోహి—నాథా! ఒక పనికిరాని యేకాదశినాఁ డుపవాసము చేసి సగము చచ్చుట మానుమని వేఁడి నందులకు నీప్రాణమే యొసఁగెదనంటివి. ప్రమాణమైనఁ దప్పెద నంటివి.

లయగ్రాహి.

ఆలయమునందుఁగలబాలురు కుటుంబినియు
జాలిఁబడుచుండఁజని శైలగుహలందుఁ
బేలవలెనుండియుఁ గపాలముగ కౌసమును
గేలనొకదండమును వ్రేలితుదదర్భల్
పోలధరియించి మృగజాలములఁగూడిఫల
మూలములుపర్ణములు గాలిభుజియింపన్
జాలిచరియించు మునిలీల నుపవాసముల
నేలమదిఁగోరెదు నృపాలకులచంద్రా.

ఇంతన్యాయ మెంచైనఁగలదా? విడువరాని ప్రాణమే విడుచుట కొప్పువాఁడ వింక నన్నవలీలగా విడువఁగలవుగదా? ఇంక నే నేల యుండుండవలయు?

రుక్మా—(కోపమున) తరుణీ! అప్పుడే చీఁకటిపడిరా. నేను హరిభజన మొనర్ప వలయు. ఇంకఁజాలు నీ మోహప్రసంగము. ఇంతజ్ఞానమా? భగవద్విషయమున భక్తిగలవారి నెట్లయిన నింకింత భక్తి వెలయునట్లు చేయుటమాని చెడుమార్గమునకుఁ ద్రిప్పఁ జూచుట పాడియా? ఇంతూరకుండుము నీమాట జవదాఁటువాఁడఁ గానని నేనొనర్చిన ప్రతిజ్ఞ కర్థమిదికాదు.

మోహి—(స్వగతము) ఆహా! నేఁ గడుదూరము పోవనిచ్చితి ఈ విభునెడ నాకుఁ గల మోహ మగ్గలముగదా? ఎట్లు మానిపోవఁజాలుదు? (లేవఁబోవ)

రుక్మా—ఏమి లేచెదవు? (చేయిపట్టి నిలిపి) నీవును నాతోఁగూడ నేకాదశీ వ్రతము నాచరింపుమా? పోయి స్నాన మొనర్చిరమ్ము. భగవద్ధ్యాన మొనర్తము.

(యవనికపడును.)

—: చతుర్థాంక-ము-సమాప్తము :—



శ్రీ

# మోహినీరుక్మాంగదనాటకము.



## పఞ్చమాఙ్కము. ప్రథమరంగము.



### పర్వతసానుదేశము.

[ ప్ర: రంభ-ఊర్వశి-మేనక-తిలోత్తమ. ]

రంభ—చెలులారా! కొంచెమైనను దాక్షిణ్యముచూపక మనము బుద్ధి చెప్పవలయు.

ఊర్వశి—రానిమ్ము. దానిఁబట్టిన దయ్యము నేవిడిపించెదను.

[ ప్ర: మోహినిని బిలచికొని వరూధిని. ]

వరూ—అక్కలారా! ఇదిగో యీ మోహినిని బిలిచికొనివచ్చియున్నాను. రుక్మాంగదు నిద్రపుచ్చి వచ్చియుంన్నది.

(మోహిని యందఱికిని నమస్కరించును)

ఊర్వశి—చాలును నిలుపుము నీనమస్కారముల. నీ విక్కడినుండిపోయి యెన్నిదినము లైనవి చెప్పుము? అట్లేల తలవంచుకొని యున్నావు? ఏలపలుకకున్నావు?

రంభ—ఏమే మోహినీ! సిగ్గులేదా? చెప్పుము మూఁడు నెలలు కాలేదా?

మేనక—ఇంకనైన రుక్మాంగదుని పొందుఁ దృప్తిపడెనా-లేదా?

తిలో—అక్కడ నెవ్వరు విటులు దొరకక యిక్కడకుఁ బరుగెత్తివచ్చితివా? లేక నీ ముద్దుమోము చూచి నీపనియంతయు నేనే చేయుచు నీకు సెలవిచ్చితినా?

రంభ—కాదే మోహినీ! నీతలదన్నిన వాండ్రెందఱోయుండఁ బదివినముల లోపల రుక్మాంగదు వ్రతము చెఱుచు యుక్తిశాలిను లెందఱోయుండ నేనీ కార్యము చేయుదునని ముందుఁబడి వచ్చితివే. ఇందులకా!

మేనక—దేవేంద్ర భోగముకంటె-సోమయాజుల భోగముకంటె-యుద్ధహత వీరుల భోగముకంటె రుక్మాంగదు భోగము నీకంత మెచ్చునకు వచ్చినదియా?

ఊర్వశి—దానితో నేమిమాటలే? మొద్దుముండ. పోదము రంభ. దీని విలుచుకొని

పోయి దేవేంద్రునకుఁ జెప్పి యిదియొనర్చిన యపరాధమునకుఁ గొన్ని నాళ్లు యమయాతనల కొప్పఁజెప్పుదము.

మోహి—అక్కలారా! నను క్షమింపుఁడు. నిక్కముగా నాకు బుద్ధిమాంద్యము గలిగెను. ఇంక మసలను. ఇదే యిఁక మూఁడుదినములలోనే యేకాదశి రాఁగలదు. ఎట్లయినను గార్య సాధనము గలిగించుకొని వచ్చెద. నన్ను మన్నించి విడిచిపొండు.

ఊర్వశి—ఇంక నీమాటలపై మాకునమ్మకము గలుగఁగలదా? ఆ రుక్మాంగదుఁ జూచిన వెంటనే నీ కైద లేచి యంగలార్పఁ గలవు. నీకుఁ దగినది యమలోకమే? నీ వాచరింప నున్న కార్యమునకు వేఱొకరిని నియమింతమట లెమ్ము. కొన్ని నాళ్లు నీవు యమలోకముననుండి వచ్చిన నీభోగాపేక్ష శాంతమగును.

మోహి—మీకు నమస్కరించి వేఁడికొందును. నామాటైనఁ జూడుఁడు. ఇన్నినాళ్లజ్ఞానినై నే మసలిన నేర మొప్పుకొందును. ఇంక మూఁడు నాళ్లుకదా! నేఁగడువు గోరుట? అనుగ్రహించి నాకొసంగుఁడు.

మేనక—ఊర్వశీ! ఏమో మిక్కిలి చెప్పుకొనుచున్నది. ఈమూఁడు దినములు గడువు నిత్తము. మోహినీ! ఈసారిమాత్రము నీవు కార్యసాధనము గావింపక కామోన్మాదము చూపితివా నిన్ను యమయాతనలకు నప్పగించుట యట్లుండఁగా మేమందఱము గలసి నీకొసంగఁగల యవమానమును బాధలును నీ వూహించుకొనఁ జాలవు.

రంభ—రంకుముండ. మేమందఱము జీవ వైకుంఠోత్సవమునఁ దనపని సహితము చేసి బాధపడుచుండఁగా సిగ్గులేక తానొక మానవునిప్రక్కనఁ బరుండి యానందపడుచున్నది. దీనికేటిగడువే? ఈ మూఁడు దినములు విడిచిన సాధింపఁగలదనుకొంటివా? చెప్పునఁగొట్టి పిలుచుకొని పోవుదము. మనరూధినిని రుక్మాంగద జయమునకై పంపుదము.

తిలో—(మోహినిఁగాలఁదన్ని) అవును. దీనిఁగృపఁజూడ రాదు గనుకేమిగడువు? దాని సిందము. ఈ మూఁడు నెలలు పనిపాటలు లేక సౌఖ్య మనుభవించినది యింక వచ్చునా? పోదము పిలుచుకొని దేవేంద్రు నొద్దకు.

మోహి—(నమస్కరించి) అక్కలారా! నామాటనైనఁ జూడుఁడు. మూఁడు మాసములు బాధపడితిరిగదా? ఇంక మూఁడు దినములకేల కక్కసించెదరు. తప్పక కార్యసాధన మొనరించి మీ బాధలు మాన్పెద.

ఊర్వ—చెలులారా! పోవనిండు. ఈ మూఁడు దినములలో నేమి చెడఁగలదు? మోహినీ! అందఱి పాదములు ముట్టి యింక రుక్మాంగదునిపై మరులునఁ గార్యహాని గావింపనని ప్రమాణము చేయుము.

మోహి—(అంజలి పాదములుముట్టి నమస్కరించి).

ఆ. వె. కోపగింపవలదు మీపాదములయాన
మూఁడునాళ్లలోనముదముమీఱఁ
గార్యసాధనంబుఁగావింతుమన్నింపుఁ
డరసితప్పులన్నియక్కలార.

(ముందు యవయనికపడును.)

---

పఞ్చమాఙ్కము-ద్వితీయరంగము.

మోహిని పడకటిల్లు.

మోహిని పండుకొనియుండును.

[ ప్ర: తిలోత్తమ. ]

తిలో--(లేపి) మోహినీ ! ఈ నాఁ డేకాదశి. రంభాదులగు మనవారు నిన్ను హెచ్చరించుటకై నన్ను బంపియున్నారు. అప్పుడే సాయంకాలము కావచ్చె. ఈరాత్రిలోపల నీవొనరింపఁదగిన కార్యము నొనరింపక పోయితివా తత్ఫలమును గుఱించి చెప్పఁ బనిలేదుగదా? మహోన్నతమేఘమండలము విమానములపైనుండినీకార్యము నిరీక్షించు చుందుమని వచింపుమనిరి. ఱేపు సాయంకాలమునకు ముందే నీవేతెంచి మమ్ముఁ గలిసికొనవలయునని చెప్పుమనిరి. హెచ్చరిక.

(నిష్క్రమించును).

[ ప్ర. రుక్మాంగదుఁడు.]

రుక్మా—(స్వగతము) ఏమికారణమో తెలియకున్నది. హరిభజనమొనర్చుటకై రము సేయుటకై వచ్చుచుండిన మోహిని యీనాఁడురాదయ్యె. పోయివిచారింతుఁగాక. (మోహిని యొద్దకువచ్చి) మోహినీ! అదేల శయనించియున్నావు. పద్మనాభ దేవాలయమునకుఁబోవలసియున్నదిగదా? ఏకాదశినాఁడు పడకపైశయనింతువే? నీకేమి బాధకలిగె?

మోహి—మనోహరా! నాకుఁగలిగియున్న బాధ యింతంతనఁజాలుదునా. అదితీర్ప నీచే నున్నది.

రుక్మాం—ఆహా! మోహినీ! నేఁడేమి క్రొత్తమాటవింటిని? నీకుబాధగలిగి నేతీర్ప సాధ్యమున్న యోచింపవలయునా? నీవింత యాజ్ఞాపించినఁ జాలుఁగదా?

మోహి—నాథా! నీవనుటకేమి. ఉపచారమునకిట్లాడెదవుగాక నిక్కముగా నీవొన రించుటకు నంశయింతునని బాధపడుచున్నాను.

రుక్మాం—తరుణీరత్నమా! నీవిట్లన్న నేనేమన నేర్తును? నీయెడ నాకుఁగల పూర్ణ మోహము నెంత సంశయించినట్టులయ్యె! అది యటుండుఁగాక. ఇష్టకామేశుసన్ని ధానమున నీమాట యేదియున్నను జవదాఁటువాఁడఁ గానని ఘోరప్రమాణమునొన ర్చితినే? దానినెట్లు మఱవసాధ్యము?

మోహి—మోహమునకేమి? ప్రశంసనీయమగు నీదక్షిణ నాయకత్వము నినుజేపట్టిన యందఱి యెడను నేకరీతిగా మోహ ప్రాచుర్యమే గావించు. ఇంకఁ బ్రమాణ మన్ననో పురుషులు రాజులును నగువారికి లక్ష్యముండఁగలదా? మీరెల్ల వారి జాతులందును వైవాహికములఁదును బ్రాణవిత్తమానములభంగమందును జకిత గోకులాగ్రజన్మరక్షణమందును బొంకినను నఘము పొందదని కుదుర్చుకొని యు న్నారే! మీకు బొంకఁగూడని విషయమేలేదు. అన్నియు నిందులోనే యణఁగి యున్నవి.

రుక్మాం—దేవి! ఇదియేమియీనాఁ డిట్లుపేక్షచేయసాగితివి. అప్పుడెపదిగడియలరాత్రి యయ్యె. ఏకాదశీ పుణ్యకథకు వేళ మీఱనయ్యె. చెప్పుము నీయభీష్టమైన నేమి? నాకు సాధ్యమున్న నవశ్యము నెఱవేర్చెద. దేవాలయమునకుఁ బోవువేళయయ్యె.

మోహి—ఇప్పటికైన నిది ప్రమాణ మేనా? నమ్మవచ్చునా?

రుక్మాం—నమ్ముము. నీయాన-నాయాన-ఆయమేశునాన నెఱవేర్చెదను. ఎట్టి ఘన కార్యమైన నొనరింపఁ బ్రయత్నించెద.

మోహి—ఘనకార్య మొక్కటికాదు. అఘటన మేనియులేదు, నాథా! చెఱకు విలుకాని బాధకు సహింపఁజాలక యన్యథా శరణముఁ గానక నిను వేఁడవలసి వచ్చియున్నది.

## అనుబంధము 16.

రుక్మాం—(చెవులు మూసికొని) హా! నారాయణ! నారాయణ! పాపము శాంతమగుఁ గాక. పాపముశాంతమగుఁగాక. మోహినీ! ఇదేమి మొఱకుఁదనమో? ఈనాఁ

డేకాదశి యగుట మఱచితివా? దినదినము కాలముగలదే? నేఁడును రేపు ద్వాదశియుఁ బోనిమ్ము. ఇష్టవిధానమున ననఁగ క్రీడలఁ దేలుదముగాక. తప్పాడితి ననుము. ఈమాట యుజ్జగింపుము.

మోహిని—ఆహా! దైవమా! నే నెంత నమ్మియుంటి? ఇష్టకామేశు వాలయమున బాస యొనర్చినందున కిదిఫలమా! నిమిషమునకుముందు నాయభీష్టమెట్టిదైనను జెల్లింతునని వచించిన సత్యమున కిడిఫలమా? పనికిరాని యొక యేకాదశీ వ్రతమునకే యింత యసత్య మాడవలయునన్న నింక నాయభీష్టము నీవెట్లు చెల్లింపఁగలవు? ఎట్టి ప్రమాణ మొనర్చినను సత్యభాషణము నిలువఁజాలవని నిన్ను సంశయించినది నిర్హేతుకముకాదుకదా? అయ్యో! నేనెంత నమ్మితిని! ఆ యిష్టకామేశుని దర్శించుకొను బుద్ధి నాకు నాఁడేల పొడమె? పొడమెఁగాక వచ్చినదాన నీరాజన్యు నేల చూచితి? చూచితిఁగాక నాకీ పృథ్వీపతిపై మోహము జనింప నేల? జనించి నంతనే యణఁచుకొని నేనమ్మలింప నంటినే? ఆ పట్టె పూర్ణముగాఁ గొనవలెను సాధింపక యతని ప్రార్థన నియ్యకొంటి నేల? ఇయ్యకొన్నను నామాట పాటించునని నమ్మితి నేల? ధరావరుల వృత్తాంతమంతయుఁ బూర్ణముగా నెఱిఁగియుండియు నీ భూమీశుఁ డొనర్చిన ప్రమాణమును విశ్వసించితి నేల? అకటా! ఎంత జేలవైతిని! ఎంత యాపదకుగుఱిరైతిని! ఎంతక్రుంగిపోయితిని! సరివారిలో నెంత పలుచఁదనము దెచ్చుకొంటిని! ఎన్నియో యజ్ఞము లెన్నియో ఘనకార్యములు ప్రకటించిన మానవులకుఁ గాక చిక్కని నాయట్టి యప్సరస యొకరాజ మాత్రునికి సశరీర సుఖమివ్వఁ దలపడి వచ్చినందునకు నాకుఁ దగిన శిక్షయేకదా? రాజేంద్రా! ఇంకొనలెమ్ము. నీప్రమాణమునమ్మిన వివేకశూన్యతకు నాకుఁ దగినశిక్ష యొసంగితివి. నీపూర్వ జన్మమున నొనర్చిన తపఃఫలమున నీమాటలకు దేలుపోయి నీకిన్నాళ్లు చిక్కియుంటి. ఇంక నే వెడలిపోయెద. నీమాట నీకొప్పఁ జెప్పెద. మాయప్సరస్త్రుణుకెల్ల నీయమోఘ సత్యనియమము వచించి నాయొక్కదాని చేటువలన వారి నందఱి నిట్లు మోసపోవకుండ నొనర్చెద. (లేచును).

రుక్మాం—తరుణీ జనవతంసమా! నీకిట్లాడుట పాడియా? నాల్గుమాసములనుండి నను బాలించుచువచ్చితివే? ఒక్కనాఁడైన నాయెడ నపరాధమునకుఁ గారణముండెనే? మీఱరాని యేకాదశీ వ్రతముగాక, నీయభీష్టము చెల్లింపకుందునే? నీకుఁ గన్నీ రేల కలిగె? నన్ను మన్నింపుము. నాయపరాధముల క్షమింపుము. ఇది నాకు సాధ్యము కానిపని. చూచితివా! నీకిట్టి ప్రణయకోపము కలిగినవేళ నిన్ను గౌఁగిలించుటకును, నీకన్నీరు ముద్దాడుటకును, నీ చెక్కులంటి-చేతులంటి-చరణములంటి వేఁడుకొని యూఱార్చుటకును నీ యేకాదశీ వ్రతమే యభ్యంతర పఱచుచున్నదిగదా?

సీ. ఘనవేణి నీచెక్కుఁగవనంటి నామోహ
మొగిఁదెలుపంగలేకున్న వాఁడ
వనజాయతాక్షి నీప్రణయకోపముదీఱ
నిన్నుఁ గౌఁగిటఁ జేర్పకున్న వాఁడఁ
దరళాక్షి నీమోహపరితాపమార నీ
కన్నీరు ముద్దాడకున్న వాఁడ
మానినీమణి నన్ను మన్నింపుమని కాళ్లఁ
నొరఁగి వేఁడఁగఁజాలకున్న వాఁడ
గీ, వదలరాని యేకాశీవ్రతముగాక
కారణంబొండు గలుగదు సారసాక్షి
బాసఁజేసెద నింతైన మోసమెఱుఁగ
నన్ను మన్నింపవే మదనాగయాన.

మోహి—మహీధవా! నీవును, నీయేకాదశియు సౌఖ్యముగానుండుఁడు. నాకేల యింక నీగొడవ? నీవే కాదశినే పెండ్లియాడితివిగాక, నాచెట్టపట్టితివా? ఎట్లును బోయెదఁ గదా? నాకేమి యీఁగొడవగలుగదు కాని నిను జూచిన, నత్యంతమగు దుఃఖము గలిగెడు. భూరమణా! మీపూర్వులు సత్యరక్షణమునకై యెన్నియో కార్యములొనర్చిరి. తమప్రాణముఁ నైతమిచ్చిరి. లోకమున నెందఱు రాజులుండలేదు? ఎందఱుచక్రవర్తులుండలేదు? ఎంతపాటుపడి యెన్నిదుఃఖములకోర్చి, వారుసత్యధర్మము రక్షించిరి. నీవు మూఢుఁడవై, యరకాసుచేయని యేకాదశీవ్రతమునకని విడువరాని సత్యవ్రతము నవివేకివై విడిచెదవేయని పరితాప పడుచున్నదాన. ఇది శేఁగుఁబండ్లుకొనుటకు ముత్యములుపోసినట్లయ్యెఁగదా? నీకర్మమునకు నేనేమిచేయుదాన? అసత్యపాపమునొప్పుకొంటివా? ప్రమాణభ్రష్టుఁడవైతివా? (ప్రమాణభ్రష్ట) ప్రభుదిక్కియ్యకొంటివా? వచింపుము కడమాట నేఁబోయెద.

రుక్మా—ఇది నా దుష్ప్రాప్తియనవలయునా? లేక నీదుశ్చరిత మనవలయునా? నాప్రాణము లైనఁదృణప్రాయముగ మానుదుఁగాక, యసత్యపాపమునకు నేనియ్యకొందునా?

మోహిని—మాటలాడితివిగాక, కార్యమున నేమిచూపితివి?

రుక్మా—తరుణీ! ఇంతూరకుండుము. నాకుఁగోపమువచ్చును. సభక్తితాత్పర్యమునవిష్ణు సేవయొనర్చుచుఁ దిరుగరాని మానసముతో నిశ్చలనిర్జలేకాదశీవ్రతము జరుపుచున్న

నాకు వ్రతభంగ మొనర్చురీతి నిట్టికోరిక కోరెదవా? అదివలదనిన నాకుసత్యభంగమా? చాలునీచాతుర్యము. నేనసత్యవాదినైన, హరివాసరమున నీతో రమింప సత్యవ్రతుఁడగు పతినే కోరుకొనుము. ఇంకనైన నేమి?

మోహిని—రాజేంద్రా! నీసాహసమును నీవాచాలత్వమును నెంతనవలెను! అసత్యమాడియు, నందునకుఁ గుందుటమాని నాపైననే తిరుగుపడి ప్రమాణములు సరకుగొనక, యసత్యముకాదని వాదించెదవే? ఇంకనాపై- నన్నే కోపగించెదవే? ఇదిజాణతనము కాదా? పోనిమ్ము. ఇదిప్రమాణమైనదియు నప్రమాణమైనదియు, దీర్చివగదెంచువారు లేకుందురా? అదితరువాత విచారింతముఁట. ఇప్పుడైనవచింపుము. నా మాట రొట్టిదైనను, జవదాఁటనని స్వామికోవెలయందుఁ జేసినప్రమాణమునుబట్టి సాధించెద. నేను నేఁడేకాదశియైనను, నేమైనను నిన్నువిడువను.

రుక్మాం—మోహినీ! నావ్రతనైష్ఠికత నిన్ని దినములు చూచియు, నీవెఱుఁగవైతివా? ఇది నాకు సాధ్యమగునా?

## అనుబంధము 17.

వలసియున్న నా రాజ్యమంతయు నీకొసంగి యడవులఁ జేరుమనుము. నాభార్యలనెల్ల నీకు దాసులుగానొనర్చి యూడిగము చేయింపుము. నాకుత్తుకయైనను, నాకొమారు కుత్తుకయైనను, ఖండించి నీయెదుటఁ బెట్టుమనుము. ఏదైననొనర్తుఁగాక, యీ వ్రతోపసంహారము మాత్రము నాచేతఁగాదు.

మోహిని—నిక్కమా? ఇదితప్ప నీవింకేమైననునడిగిన నీయఁగలవా? ఇత్తువా? ఇదియైనఁ బ్రమాణవచనమేనా?

రుక్మాం—నీవేప్రమాణము చేయుమన్నను జేసి తప్పక యొసంగుదును.

మోహిని—అట్లయినకానిమ్ము. నీవు నీకొడుకు తలకోసి యిచ్చెదనని వచించితివికదా? ఆ కార్యమొనరింపుము.

రుక్మాం—హా! దైవమా! (అనిమూర్ఛిల్లును)

మోహిని—(రుక్మాంగదునకు శిశిరోపచారములు చేయుచు) రాజేంద్రా! రాజేంద్రా! అహా! ఎంతకార్యమాయెను. సేవకా!

[ప్ర. సేవకుఁడు.]

నీవీక్షణమునఁబోయి రాజుగారు మూర్ఛిల్లియున్నారనిచెప్పి తగినయౌషధములు తీసుకొని రాజవైద్యుని రమ్మనుము. అహా! నేనెంత క్రూరకృత్యమొనర్చితి! కామనోనాథునకెంత యాపదగలుగునట్లొనర్చితి! అచ్చరలలో నెందఱోయుండిరిగదా! నే నేల యీవ్రతభంగ కార్యమునకుఁబూనితి?

[ ప్ర: తిలోత్తమ (పైనుండివచ్చి) ]

తిలో— మోహినీ! పైనుండి మేమందఱము. వినుచున్నారము. మంచిమార్గముఁబట్టితివి. మనకార్య సాధనమునకు నిదియే సమయము. ఇదియేదారి. తిరిగితివా వనితప్పను. భద్రము. భద్రముసుమా? (నిష్క్రమించును.)

[ ప్ర (శ్రీఘ్రగమనమున) రాజవైద్యుఁడు సంధావళి-కోమల చంద్రకాంత-ధర్మాంగదుఁడు.]

సంధ్యా— అమ్మా! మోహిని దేవీ! ఏల యీరాజున్యన కీమూర్ఛగలిగె?

మోహిని— వైద్యచంద్రమా! ఏదేని చికిత్సయొనర్పుము. తెలివిగలిగింపుము. అమ్మా సంధ్యావళీ! దాఁచనేల చెప్పెదను. నేనీరాజున్యు నొకస్వల్పకార్య మపేక్షించితి. అదితనయేకాదశీవ్రతమునకుభంగముకలిగించుననియొసఁగఁడయ్యె. నామాటమీఱం డని యతఁడొనర్చిన ప్రమాణమునునిర్బంధించితి. ఏమన్నను మానకతనకొమరుని కత్తుకయైనఁగోసియిత్తుఁగాక యీకార్యము నేఁ జేయనని మనస్వీగా నను గోపగించుకొని మాటాలాడె. నేను నీకొడుకు కుత్తుకయేకోసి యిమ్మంటి మూర్ఛిల్లియున్నాఁడు.

కోమల చంద్రి — ఓసి! దురాత్మురాలా! ఓసిగయ్యాళీ! ఇదెట్టికోరికయే? సుకుమారు కంఠ చ్ఛేదనమొనర్చుటకు రాజేంద్రుఁడెట్లొప్పఁగలఁడు? ఇంతదౌరాత్మ్య మెందైన వింటిమే?

(వైద్యుఁ డుపచారము చేయఁగా రాజునకుఁ దెలివిగలిగి లేచి కూర్చుండును.)

రుక్మా— హా! మోహినీ? నాకెంతటిపెనుఁగుపాటు గలిగించితివి. సఖీమణులారా! మీరువచ్చియెంత సేపైనది? మోహినీ! నీక్రూరకృత్యము మానితినను. తప్పొడితి నను. నిర్బంధము మానుము. నాపైఁగరుణ రానిమ్ము.

సంధ్యా— మోహినీదేవీ! చేయరాని కార్యములు చేయుమనిపలికి నిర్బంధపెట్టుట పాతివ్రత్యమునకే భంగము కలిగించునదికదా?

సీ. కామినీమణికి మంగళసూత్రమేచాలు
శృంగారముల కెల్లఁ జెలువుచూప
ధవళలోచనకు నైదువతనం బే చాలు
వైభవంబుల కెల్ల వన్నెఁబెట్ట
నంబుజాననకు,బుణ్యాంగనాత్వమే చాలు
రాజసంబుల కెల్లఁ దేజమెసఁగ
సతికి నాథుఁడు దృఢస్థితినుండు టేచాలు
భాగ్యలక్ష్ములకెల్లఁ బ్రభఁదనర్ప

గీ. నెన్ని జన్మములందుఁ బద్మేక్షణలకుఁ
బతిహితంబునకంటె శోభనముగలదె
యిహపరములిచ్చు హృదయేశుమహిమఁ దెలియ
కధిపుమదినొవ్వఁ జేయుట యవ్రతమగునె

మోహిని—నీధర్మోపదేశము నాకు ననపేక్షితము. పాతివ్రత్యమంతయు నీవేయెఱిఁగిన దానవనుకొంటివా? రాజేంద్రా! ఏదైననొకటి నీవొనర్పకున్నఁదీఱదు. వ్రతము మానెదవా? కొడుకుం జంపెదవా?

కోమల—నాథా! దీనికేలయిట్టియున్నతి? దీనిమాట జరుపకున్న జగత్ప్రళయము కాఁగలదా? తొలఁగింపుము నీయింటినుండి. ఇట్టి క్రూరచింతయొనర్చు దాని నాదరింప వచ్చునా?

చంద్రికా—ఇదికోరినకోరిక జరుపనేల యునవునంత నిర్బంధమేమి? ఎవతెయైనను, గొడుకుం జంపుమని నిర్బంధపెట్టు దుర్జాతి గలుగునే?

మోహిని—సవతులారా! మీకేమి కావరము హెచ్చినదా? నోటికడ్డము లేక మాటలాడుచున్నారు? మిమ్ము న్యాయము తీర్పఁడఁ బిలిచిరా? పిలువని పేరంటముగా వచ్చి, కాకులవలెఁ బాగితిరా? ఊరక నాలుక బిగఁబట్టి పడియుండుఁడట్లు. మిమ్మెవ్వరు నీతులడుగలేదు.

కోమల—వేశ్యా! ఇది నీకులము తప్పితము కాని నీతప్పితము కాదు. కన్నవారిఁగలసి మోహమన్న మాట మూలఁబెట్టి మనఁగల సామాన్యకు సక్రూటికము గలదా? సదసద్వివేకము గలదా?

మోహిని—ఔనే! సిగ్గులేక పతియెదుటనే వేశ్యతో సరిగట్టుకొని నాట్యమొనర్చునట్లు మాటలాడితివే? నీవు ప్రచ్ఛన్నవేశ్యవుగావా?

సంధ్యా—అమ్మలారా! మీరేల వాదించుకొనియెదరు. నిలువుఁడు.

మోహిని—రాజచంద్రా! నాకుఁ బ్రత్యుత్తరమిచ్చుటకుఁ జేతఁగాక నా సవతులఁ బ్రేరేపించి నను దిట్టింపసాగితివా? నాకేమి యువలదు. సత్యము జరుపలేకపోయితివనుము. మాటయిచ్చి తప్పితివనుము. ఆమాటాడుము. నాకిఁకేమి యువలదు. ఇట్లే విడచి పోయెద.

ధర్మాంగ—జనకా! నీవేలయోచించెదవు? వ్రతభంగమైన నాప్రాణమైనఁగదా మాపిన్నతల్లి మోహినీదేవి కోరికొనుట? ఎన్నిదినములనుండియో, యాచరించుచుండిన యీ వ్రతము మానుటకగునా? చెప్పరానిదోషము సిద్ధించుఁగదా? ఇంక నాలోచనకా? నీవేలయోచింతువు? క్షణభంగురమైన యీప్రాణము నువ్రతము నిలుపుట కైక్యజించి పరమపావనమగు హరివాసరమునాఁడు నారాయణచరణసన్నిధికిఁ బోవనెంచుటకు, నాకు

జన్మజన్మాంతరతపఃఫలముకదా? అదియెట్లులభింపవలయును? నేసంతసమునసమ్మతిఁ జెందెద. నీవించుకయు యోచింపకుము. ఎత్తుము నీకరవాలము! నన్ను ఖండించి నాకుఁబుణ్యగతి యొసంగి, వ్రతము స్థాపింపుము. మాతల్లులును నీవును సుఖముగనున్న నాయట్టిపుత్రులు నీకెందఱో గలుగవచ్చు. సంశయింపకుము.

రుక్మాం—హా! దైవమా!

మోహిని—కుమారా! అరకాసుచేయని వ్రతమునకై, నీప్రాణములు పోఁగొట్టుకొన నుద్యమించితివా?

అనుబంధము 18.

ఇదెట్టి వివేకము?

సంధ్యా—రాజచంద్రా! ఈమోహినీదేవిమాటలెట్టివైనను, జవదాఁటనని ప్రమాణమొసంగియుంటివి. ఏమిదైవప్రేరణయోగాని యామె నీవ్రతభంగమొనర్పనభిలషించినది. దానికోర్వక నీకొమరునైనఁ దలఁగోయుదునని వచించితివి. అదియిష్టముగా నాయమ నిర్బంధింపఁ దొడఁగె. దీనియందు ధర్మసూక్ష్మమేదియు లేదు. నీవు సత్యము పరిపాలింపనే వలయును.

చ. తనువులుతోడరావుతుదఁ దామరసాక్షులుఁ శాశ్వతల్ గరుల్
ధనములు రాజ్యసౌఖ్యము వృథా సహజన్ములు బంధుమిత్రులుం
దనయులు మిథ్య యెంతయు ముదంబునఁ జేసిన ధర్మమొక్కటే
మనుజవరేణ్య నిల్చునది మానవకోటికి నెల్లకాలమున్.

ఈకుమారుఁడును ధీరమానసమునఁ దానొప్పగించుకొనుచు వ్రతమును గాపాడుమని నిండుమోదనతోఁ బలికె. కావున సత్యపాలనమునకై పుత్రమారణకృత్యమైనఁ జేయఁదగియేయున్నది. (ధర్మాంగదుని గౌఁగిలించి) తనూజా! నీవుగదా సత్పుత్రుఁడవు. పుణ్యదినమగు హరివాసరవ్రతము భంగములేకుండ నిలిపి పుణ్యలోకగతి వడయుటకు నీవుద్యమించితివి. ఇంతకంటె భాగ్యముకలదా? చిఱుతవాఁడవయ్యు జ్ఞానాధికత గలిగి తలిదండ్రులకింత ప్రీతియొనర్తువే? నీయట్టిసుతుఁగనుటచే, నేవీరమాతనైతి. ధన్యనైతి. అయిన నీకుఁబెండ్లి మొదలగు కార్యములు గావించి, పెద్దవాఁడవై, కొడుకులఁగాంచి సుఖించుచుండునది చూచి, యానందింపలేకపోయి నేనియ్యంతమాత్రము పొక్కుచున్నదాన. (కన్నీరునించి ముద్దాడును).

రుక్మాం—హా! దైవమా! నాకెట్టిప్రాప్తిఁదెచ్చితివి!

ధర్మాంగ—జనకా! నీవు ప్రాకృతునిభంగి నిట్లు శోచింతువేల? లోకమునన్నిధర్మములు సత్యమునకంటె నెక్కుడుకాదు. ఎన్నికష్టములనుభవించియైనను, నెన్నికష్టములు

వడియైనను సత్యము కాపాడకున్న ఫలమేమి? నేనెన్నిదినములు బ్రతికినను హరిప్రీతిగాఁ బ్రాణము లొసంగుసంతపుణ్యము నాకుఁ గలుగ నేర్చునే? జనకా! ఇఁకనైన యోచింపకుము. నిగ్రహముఁగలిగి సత్యము పాలించి, నన్ను వధించి నాకును మాపినతల్లికిని సంతసము నింపుము.

మోహిని—

క. కలిమికి రాజ్యవిభూతికి
నిల వ్రతములు సేయుటెల్ల నీగతిఁజూవళ్
పలవదు ప్రాణముగల్గిన
బలుసాకులుదినియునైన బ్రదుకఁగవచ్చున్

చచ్చివపిదవ నేటిసద్గతి? నీవుపసివాఁడవు. ఆరయ నేరవు. మేఘములనమ్మి చెఱువు నీటినిజల్లించుకొను వారుందురా?

ధర్మాంగ—మాతా! దేవవ్రతమైనసర్వధర్మములు నెఱిఁగిన నీ వీమాట యాడవచ్చునా?

అనుబంధము 19

జనకా! లెమ్ము

మోహిని—సంధ్యావళీదేవీ! నీవైనను జెప్పుము.

కం. అరపైకంబును జేయని
హరివాసరమునకునై నిజాత్మజుమనుమఱ్
గరవాలంబును బూనెడు
కరణి యినుపమొలకు మేడఁగాల్చుట కాదే?

ఈ వ్రతము మిమ్ముద్ధరించునదేమి?

సంధ్యా—మమ్ముద్ధరించుటటుండనిమ్ము. ఆవ్రతమునీకొనర్చినకీడైననేమి? ఇంతదానిపైఁ బగఁబట్టితివి? ఈ వ్రతము భంగపఱచుటకే నీవు కంకణముకట్టి యిందువచ్చినట్లు తోఁచుచున్నది. నాథా! వ్రతమును, సత్యమును రెండునునిలుపుము.

రుక్మాం—ఆహా! నాకిప్పుడు జ్ఞప్తికివచ్చె. ఈమోహిని వచ్చినరోనిమిది పదిదినములకే, యేకాదశివచ్చె. ఆనాఁడునన్నెంతోనిర్బంధపెట్టె. అప్పటికొకరీతిఁ జాలించియిపుడింతనిక్కచ్చియొనర్చుటకుఁ బ్రారంభించియున్నది. ఇందేమోయున్నది. వాదుర్విధిరేఁయీమార్గమున, నాకు వ్రతభంగము ఘటించి కీడొంచినట్లున్నది. కానిమ్ము మోహనీ! నీవూఱడిల్లుము. నేనసత్యవాదినగుటయుఁగాకుండుటయు నీ వెఱుఁగఁగలవు. కుమారా! రమ్ము.

ధర్మాంగ—(చేతులుజోడించికొని తండ్రియొద్దకుఁబోయి నిలిచి) పరమేశా! నన్ను నీ సన్నిధికిం గొమ్ము. మాతండ్రికెట్టిపాపమునుగలుగకుండ వ్రతస్థాపనము చేయింపుము. స్వామీ! ఇదె నమస్కరించువాఁడ. (నమస్కరించి) అమ్మలారా! మీరెల్ల ధైర్యము వహింపుఁడు. మీపుత్రునికి సద్గతిగలుగనున్న దే యనియానందింపుఁడు.

## అనుబంధము 20.

(బోరగిలఁబండుకొనును.)

రుక్మా—(ఖడ్గము చేపట్టిలేచి) రమారమణా! ఇదే నేఁబలిన చెల్లించువాఁడ. వ్రతభంగమునకు మనసొప్పక యసత్యపాపమునకు రోసి, నాసుతునిఖండించువాఁడ. ఇదెంత క్రూరకృత్యమైనను, సత్యభంగమునకంటె మించినది కాదనినమ్మి, యీ కార్యమొనర్చువాఁడ. పరమేశా! నాకు ధైర్యముఘటిల్లఁజేయుము. తిరుగుఁబాటు జనించునట్లొనర్పకుము. నీపాదముల నే సభక్తితాత్పర్యమునఁబూజించువాఁడ నేని, నిశ్చలమానసమున నీకుఁ బ్రీతిగానీ యేకాదశీవ్రతము నే సలుపుదు నేని, యెల్లవేళల నసత్యమన్నఁ గంటగించువాఁడ నేని, మానసమున నెప్పుడును బరోపకారము చింతించువాఁడ నేని, కృత్రిమవిధానము లేక నిక్కంపుదైవభక్తికలవాఁడ నేని, యనవరతము భూతదయ నాకుఁ గలదేని, వెలలేని నీయనుగ్రహము నేఁబడసినవాఁడ నేని, నాకేమియుఁ బాపముగలుగకుండ సత్యము నిలిపి వ్రతభంగము లేకుండ నను గాపాడుము. (కత్తియెత్తి) ఆహా! హస్తమా! నీవు నాకెంతయు సహయోగకారివై యున్నావు. హరిపాదసరోజపూజయొనర్చుటకు నీవేకదా నాకాధారమవు? అతిథితృప్తిగా సర్వదానములొనర్చుటకు నీవేకదా మూలమవు? గోబ్రాహ్మణధర్మసంరక్షణకై యరినిధనమొనర్చుటకు నీవేకదా నాకుఁ దోడు? అతిథులఁ బెద్దలశుశ్రూషలొనర్చుటకు నీవేకదా నాకుసహాయమవు? నీతో నెన్ని తపములో, యెన్ని యజ్ఞములో, యెన్ని దేవపూజలో, యొనర్చి లేక లేక, వడసిన నాయేకపుత్రుని సంహారమొనరింపింతునని నే కలనైనఁ దలంపనైతిఁగదా? ఇప్పుడా కార్యమొనర్ప నుంకించితిని. ఇది యెంతయు సత్యమునకై యొనర్చుట కావున నీవు శంకింపకుము. ఎన్ని దురవస్థలో, యెన్ని మనఃక్లేశములో, యెన్ని శరీరకష్టములకైన నోర్చి సత్యము పరిపాలింపవలయుఁగదా? ఆ సత్యపరిపాలనానంద మేకపుత్రమరణదుఃఖమునకంటె నూఱుమడుంగులెక్కువయగుఁగదా? కానిమ్ము. నీపనియొనర్పుము. హృదయమా! నీవించుకైనఁ గళవళింపకుము. పూర్ణభావమున సత్యస్థాపనమునకై కడఁగుము. భ్రాంతిమై దారపుత్రులని సంబంధము లేనివారియెడ మోహమునించి ప్రవర్తింతుము గాక. ఇవియంతయుఁగలలోని నటనములని యెఱుఁగఁజాలక యున్నాము. పుత్రుఁడెక్కఁడ? జనకుఁడెవ్వఁడు? ఒక్కరు నిలుచువారు కారు. సత్యమొక్కటియే నిలుచునది. సత్యమొకటియే ప్రజ్వలించి ప్రకాశించునది. ధర్మమొక్కటియే తోడమాపునది. కావున నీవింతైన వెనుదీయక నాచేత నీకార్యమొనరింపఁజేయుము.

కన్నులారా! మీరు నీరు నింపకుఁడు. జితేంద్రియత్వమున ధర్మస్థాపన మొనర్చుటకై యెట్టిసంకటములు నెంచు కార్యమునఁ జేరుఁగల సమయముకాని శోకమునకు సమయము కాదు. మనోహరుఁడగు నేకపుత్రు సంహారమొనర్చు కార్యమే మేమెట్లు చూడఁగలమని మీరాలోచింపకుఁడు. నశ్వరమైన యైహికఫలము లభింపకున్న మానెఁగాక యీ కార్యమున ననశ్వరమైన యాముష్మికఫలము తప్పక లభింపనున్నది. కావున మీరు జాగరూకతమై యశ్రునిర్బంధము లేక చూచి కార్యమొనర్పుఁడు. ఇదే యింకఁ గార్య మొనర్చెద. (ధ్యాన మొనర్చి భగవంతుని బేర్కొని) శ్రీహరీ! (అని యఱచి ఖడ్గ మెత్తును).

[పైనుండి ప్ర: విష్ణువు-లక్ష్మి.]

విష్ణు—అహా! రుక్మాంగదా! మెచ్చితి. మెచ్చితి. నిలువుము.

మ॥ అరరే మెచ్చితి మెచ్చితిన్ దలఁపఁగా నత్యద్భుతంబయ్యె నీ
చరితం బీగతి సద్వ్రతాచరణమున్ సాధించువారుందురే
కరుణన్ జూనక దానికై నిజసుతున్ ఖండింప నుంకించితే
సరిమీ రెంగద సాహసోద్యమ మిఁకన్ జాలింపు రుక్మాంగదా.

(అందఱు సాష్టాంగ నమస్కృతు లొనర్చెదరు).

విష్ణు—రుక్మాంగదా! నీమహిమ మసమానము. ఎవరును నీయట్టి మనోదార్ఢ్యము గలవారుండుటరిది. వ్రతమునకై యిన్ని నియమములు జరిపిపుత్రు నైనఁ బలినొసంగ నుద్యమించితివి. మాయురే! నీయట్టి వ్రతశీలుఁడున్నే! మీ యెల్లరయెడ నా కత్యంతానుగ్రహము గలిగె. కొన్ని దినములలో నిను నాలోకమునకుం గొని యున్నత పదవి యొసంగెద. పదెనిమి దేఁడుల బాలుఁడయ్యు నీకుమారుఁ డొనర్చిన యాత్మతిరస్కార మెంతయుఁ గొండాడఁదగియున్నది. డెబ్బదియేండ్లవారికైన నిట్టి తృణీకృతదేహత్వము సిద్ధించునా? ఇతఁడును బహు సంవత్సరములు రాజ్యమేలి నాయెడకేతెంచి నీతో నుండఁగలవాఁడు, నీపట్టమహిషి సంధ్యావళియుదారగుణము నామె పతిభక్తియు వ్రతభక్తియు సత్యాభిలాషమును నెంకయు గొండాడఁదగియున్నవి. కాకున్న తన యేకపుత్రు ముద్దుపట్టి నెనిమిదేఁడ్ల పాపని దానికై పోకార్చుకొనుట కొప్పియుండునా? ఆమెకు సద్గతియే కలుగఁగలదు. ఈమోహినియును నొకకారణమున నీకు వ్రతభంగము కలిగించు నుద్దేశమున నిట్టిపూనిక చూపినదిగాక క్రూరమానసము వహించినది కాదు. నీసంసర్గము కలిగియుండుటఁ జేసి యీతన్వికిఁ బుణ్యము లభింపవలసియే యున్నది. అమరవనితయై నందున నీ చెలువకు నా లోకమునకు

సశరీరముగా వచ్చుటకొక్కొక్కవేళ లభించుఁగాన నీసంసర్గమున నీపుణ్యప్రాప్తినే నొసంగెద. ఏకాదశీవ్రతము సాంతముగా జరిపినవారు ద్వాదశి పగటివేళ నిద్రించిన వారికిఁ దద్వ్రతఫలము లభింపకుండుఁగదా? ఆఫలమెల్ల నీ మోహినీ సతికి లభింప ననుగ్రహించెద. తన్మూలమున నాలోకమునకు నిరాటంకముగా వచ్చుటకును నప్పుడప్పుడు నాదర్శనము లభించుటకును స్వాతంత్ర్యము గలిగియుండుఁగాక. రాజేంద్రా! నీకు శుభమగుఁగాక.

అందఱు—(సాష్టాంగనమస్కారమొనర్చెదరు.)

లక్ష్మి— అనుబంధము 21.

రుక్మా—దండకము:—జయజయజయలోకనాథా! బుధారాధ్య వేధోనిలింపాదినాథాదివంద్యా-పరబ్రహ్మ నీవే-జగత్కర్త నీవే-పరేశుండ నీవే-గిరీశుండ నీవే-సురేశుండ నీవే-దిగీశుండ నీవే-జగత్సాక్షి నీవే-త్రికాలుండ నీవే-త్రిలోకుండ నీవే-త్రిరూపుండ నీవే-త్రివాచ్యుండ నీవే-త్రివంద్యుండ నీవే-త్రిదూరుండ నీవే-చరాత్ముండ నీవే స్థిరాత్ముండ నీవే-సమస్తప్రపంచంబులందున్న జంతుప్రకాండంబులందున్న తేజోవిలాసుండ నీవే జగద్గర్భ నిన్నున్నుతింపంగ నేనెంతవాఁడన్ గుణం బెన్నఁజాలన్, విలోకింపఁజాలన్-నుతింపంగఁజాలన్-

రుక్మా—మునీశాన సందోహ ప్రేమావలోకా,
మోహి—ఘనాహార్యచంచన్మహాధైర్యరేఖా,
సంధ్యా—సునీడోద్భవాధీశ దివ్యత్తురంగా,
చంద్ర—అనాయాస నిర్ధూతదైతేయసంఘా,
కోమ—ధనూత్తంస శౌర్యనిధ్యాతశార్ఙ్గా,
ధర్మ—మనోమాత్రసంసృష్టలోకప్రపంచా,
రుక్మా—మనోజ్ఞప్రకారాత్తమాయూరపింఛా,
మోహి—దినాధీశమిత్రాది దేవేశపూజా,
సంధ్యా—జనాలోకదుర్గమ్య మహత్త్వజఁఝా,
చంద్ర—అనాధారలోకాధికాధారవిజ్ఞా,

కోమ—దినేశాన తేజోతి గమ్యప్రఖేటా,
ధర్మ—అనూచాన సేవావసన్నీలకంఠా,
రుక్మ—అనాధేయగర్భస్థబ్రహ్మాండభాండా,
మోహి—క్షణాగమ్యవృత్తి ప్రకృష్టప్రగూఢా,
సంధ్యా—అనార్ద్రప్రథారావిరాజత్కృపాణా,
చంద్ర—సునిలా ధరిత్రీ రమాసత్సమేళా,
కోమ—ఖనీభూతకారుణ్యభంగీసనాథా,
ధర్మ—అనాయత్తమాహాత్మ్య వేదాంతపాదా,
రుక్మ--సునాభీసరోజాతసంభూతవేధా,
మోహి—అనాఖ్యాతదుర్జ్ఞేయలీలావిధానా,
సంధ్యా—సునామప్రభాజాలనిర్ధూతపాపా,
చంద్ర—సునాశీరచేతస్సరోజద్విరేఫా,
కోమ—సునాకద్విషత్కుంభిహర్యక్షశాబా,
ధర్మ—వినాయత్ననివృత్తసల్లోకగర్భా,
రుక్మ—సనాథప్రభోపేతవైకుంఠధామా,
మోహి—మనీషావిచారప్రనిర్దగ్ధమాయా,
సంధ్యా—వినీలాంచదుత్తుంగదివ్యచ్ఛరీరా,
చంద్ర—అనాదిప్రకారస్వసంబోధలీలా,
కోమ—సునారాయణా కేశవా వాసుదేవా,
ధర్మ—దినాధీశమధ్యప్రకాంతప్రకాశా,
రుక్మ—గుణాతీతవాఙ్మానసాతీత వేషా,
మోహి—ఘనానంతసానందశశ్వద్విలాసా,
సంధ్యా—మనోబుద్ధికర్మేంద్రియాతీతదేహా,
చంద్ర—వినాశప్రభాపూరకల్పాంతవేళా,
కోమ—సునీడాయతాకల్పచక్రప్రదత్తా,
ధర్మ—సురారాతిశిత్తా, సురేశానపత్తా,
రుక్మ—మదేశేంద్రరత్తా, సదాదివ్యమోత్తా, నమస్తే నమస్తేనమః

అనుబంధము 22.

(మంగళం. యవనికపడును).

# ఉత్తరరంగము.

[ ఒకానొక నటుఁడు ప్రవేశించి ]

ద్వి॥ అనఘాత్ములార రుక్మాంగదు చరితఁ
గనుఁగొన్న నాశ్చర్యకరమగుఁగాదె
ఘననిష్ఠసలిపి యేకాశీవ్రతము
వనజాక్షుసత్కృపఁబడసె నీఘనుఁడు
నిత్యమహావ్రతనిష్ఠఁజెన్నారి
సత్యవ్రతమునిల్పుసరణికై యకట
జగతీజనంబులాశ్చర్యంబు జెందఁ
దగఁగుమారుని నైనఁ జలగోయఁగడఁగె
నెట్టిసత్యవ్రతంబిదిజనులార
పట్టిఁజంపుటకొగ్గుభంగియద్భుతము
ఏనిష్ఠనైన మహీజనుల్ జరుప
మానకయడరించు మహితమౌయశము
ఎల్లనిష్ఠలలోన నిలసత్యనిష్ఠ
విల్లసిల్లెడుకీర్తి వెలయించుచుండి
అదియుండుఁగాక మహాజనులార
మదినెంచియొక్కసూక్ష్మమునింతకనుఁడు
సత్యవ్రతంబుల సరిలేనిమహిమ
స్తుత్యుఁడైయున్న యీక్షోణీవిభునకుఁ
బట్టినైనఁదెగించివధియింపఁగడఁగు
నిట్టిమహాపద కేమికారణమొ
మఱినెంతచూచిన మతివేఱులేదు
అతిగృత్యమొక్కటేయగుఁగారణంబు
వడి "నతిసర్వత్రవర్జయేత్" నెడి
నుడియింత తలఁపనెందునుదప్పునదియె

అక్కటమంచి కార్యం బైనంగాని
మిక్కిలి చేయుట మేలుగాదగయఁ
జెలువార నేకాదశీవ్రతం బెంత
వెలలేనిదని తానువినియున్న నేమి
తానావ్రతముసల్పుఁదగు నిందుభక్తిఁ
గాని లోకముపట్టుగా బలవంత
పెట్టంగఁదగునె యీవృత్తంబటన్న
నట్లైనిక్కంబుగా నతికృత్యమయ్యె
భావింపఁజనులకుఫలమయ్యెఁ గాని
దేవవేశ్యలకు నెత్తినదుఃఖమయ్యె
నెంతమేలైననా నెవరికోకీడు
ఎంతకీడైననా నెరివకో మేలు
జాడగానటు మేలొసంగని కీడు
కీడొసంగని మేలు క్షితినుండఁబోదు
మితిమీఱఁగీడైన మేలైనఁగాని
యతిమాత్రముగఁజేయుటదివిరోధంబు
దానసేకాదె యీధరణీవరునకుఁ
గాననియెడనుండిఘనదుఃఖమడరె
హితమారజనులార యెన్నఁడుగాని
యతికార్యమొనరించుటదికీడుసుండి
విరిబోణులార సాధ్వీమణులార
యరయరే యిందుసంధ్యావళిచరిత
మిట్టిపతివ్రతలెందైనఁగలరె
యట్టివిచారింప హరిణాక్షులార
తెలియంగనీసాధ్వీధీరగుణంబు
వెలయాలికిని నించెవెసనద్భుతంబు
తానింతవలదన్నఁదనపతి మోహి
నీనాఁటఁగలయుటనిలుచుచునుండెఁ

వాడిగాదంచునొప్పకుమమ్మయంచుఁ
వేడియాండ్రెల్లనెంతో వేఁడికొనిరి
యొప్పలాడి నిజేశుఁడొనరించువాంఛ
తప్పకతీర్చుటే తనధర్మమనుచు

ధీరమానసమునందీపారివిభుఁడు
కోరినవెలయాలిఁగూర్పదేయకట
యిదియెంతసతిధర్మమిదియెంతసుగుణ
మిదియెంతయుపకార మిదియెంతఖ్యాతి

యింతటిమాహాత్మ్యమెనయుటఁజేసి
కాంతసంతసమారఁగాంచెశ్రీధరుని
మంచిపతివ్రతామహిమకునెందు
నెంచిచూడఁగసాటియిలలేదునుండి

బహుసుధీయుతులార బాలకులార
మహితంబుగాదె ధర్మాంగదుమహిమ
తనతండ్రిసత్యంబు తగనిల్పుకొఱకుఁ
దనతలఁదెగఁగోయఁదానొడంబడునె

యీపసిబాలునకెంతటిత్యాగ
మేపారునే యెందునింతవైరాగ్య
మహహాసుగుణ మహోదారతయెంత
రహిమించునాత్మతిరస్కారమెంత

విలసిల్లుసరిలేనిపితృభక్తియెంత
వెలలేనిపరమార్థవిజ్ఞానమెంత
యరుదారియున్న యాహరిభక్తియెంత
పరఁగినయుపకారపరతయదెంత

శీలమెంత మహార్థసిద్ధియదెంత
మేలెంత తత్త్వసమ్మితబుద్ధి యెంత
బాలకులకు నెల్లభక్తియటన్న
వాలారు పితృభక్తివరరాజభక్తి 80

ఘనసత్యభక్తియుఁగడు దేవభక్తి
దనరారనివియ కాదా భక్తులవని
కర్మఠులా బాలక శ్రేష్ఠులార
ధర్మాంగదుని మహోదారసద్గుణము 84

నెల్లఁజేకూఱమీ కేదియసాధ్య
మెల్లందుఁగీర్తియు నేపారుముదము
గలిగిభూజనులెల్లఁగనిమిమ్ముఁబొగడ
నలఘుదేశక్షేమమలరారునుండి 88



# అనుబంధములు.

అనుబంధములు.

1 యమ—రాగము-బిలహరి తాళము.

మేలుగానాకు-నను-కూలమెంత
గల్గెనహా పోలఁగమఱి-చాలసుఖము
లీలనించెగాదే-సఖా ||పల్లవి||
పొందుగామిత్రతతి-నందమాఱఁజూడఁగా
విందుగనర-విందనయను-చందమెందుబాడఁగా|| ౧

2 అందఱు—రాగము-మోహన రూపకతాళము.

పాలనసేయవేయోకరి-వరదాకరుణాలవాల ||పల్లవి||
ఎనలేని-కరుణఁజూడు-మనిపిమమున్-గాపాడు-మనుచువేఁడు
వారముశ్రీ-వనజభవా దినుతశౌరి||పాలన||
సురజాలావనకరుణామాధవనీ
చరణసారసములపూజ లె-మఱవక చే-సెదముదేవా||పాలన||

3 మోహిని—రాగము-హిందూస్తాని బెహాగ్ ఏకతాళము.

వర-నీ రేజనేత్రకరుణింప వే-నా నేరములనుమదిమన్నింపవే
మదిమన్నింప వే-దయనింపవే ||పల్లవి||
నీమదినెంతో యాదరము-న్నుండఁగనీవఱకున్ బ్రేమచెలంగఁగ
నా యెడన్-బెంచితిమోహామున్||వర-సామాజయానదయ
పోనాడకె-నను-నీమాడ్కి నరగంటఁ-జూడఁగనేనెటు
కాముబారికిని-దాళుదునే-హా కామినీ ||వర||
చాలునునాపైఁగోపమునీ-సమ్మతి-జూపఁగదే
బాలరో నాయపరాధమున్-వారక కావవె||

అనుబంధము.

వరనాళీకముఖి నే-నీదాసుఁడనీ- కేలంటి కాలంటి
వేఁడవఁగావను-బాలించి కౌఁగిలియీఁగదవె నీలాలకా ॥౨॥

4 మోహిని—రాగము-బేహాగ్ ఏకతాళము.

నా-మోహన-రారా నాకు-మోదము-నింప
నా మోహన రారా-నా ప్రాణేశ రారా నాకు ॥పల్లవి॥
తాళఁగలనె కడుదయతోఁ-దగ దేవ కౌఁగలసి
యేలరార-బాళిగిర-యిదెంత వింతచలమో
చాలఁగనె-బాలను రా॥నా మోహన॥ ॥౧॥
చిన్నతనముననె నీ యెడఁ-జెలఁగిన మోహమునఁ
జెన్నుమీఱి-యున్న నారి-సిలుగు బెట్టఁదరమా
యున్నతి చెన్నారగ-నన్నేలక-యున్నావుగా
యెన్నాళ్ళు నా-విన్నపము॥నా మోహన॥ ॥౨॥

5 అందము—రాగము-పీలు ఆదితాళము.

వాణీనాయక-వైభవదాయక
వరజగత్సృష్టివిధాయకా ॥పల్లవి॥
తుంగవిలాస-మంగళవేషా
సంగతసజ్జనపోషణా॥ ౧
శ్రీమహనీయా-ప్రేమామేయా
కామితఫలసంధాయకా॥ ౨
పాపవిభంగా-తాపససంగా
దీపితహంసతురంగమా

6 బ్రహ్మ—రాగము-బిలహరి రూపకతాళము.

ఇందిరా విభుఁడు-నందను నెడ
నందంబగు-చందముదయ-చెందెనుగా ॥పల్లవి॥

అనుబంధములు.

వనరుహాలోచనునకుఁ దెలి
యనియోచననాకున్న దె
ఘనమగునను రాగమునన్
మనసారఁగ-నను బ్రోచుట
కని కాదె-నినుబంపెను॥ఇంది॥ ౧

7 అప్సరసలు—రాగము-సురటి రూపకతాళము.

శారదామనోజ్ఞ-భృంగ వారిజాసనా॥
దేవపాలనందనా-శ్రీవరనందనా
పావనమౌనీంద్రవినుత-పాదపంకజా॥ ౧

8 అప్సరసలు—రాగము మాల్కోస్ రూపకతాళము.

ఆహా ధాతమాకౌ నే-కూర్పుండగా
మహాకష్టగతిగ ల్గె- నేమందుము॥
నిరంతర వైకుంఠ-గమనంబున
దురంతంబుగామాకు-దుఃఖంబగున్॥ ౧
పగల్ రాత్రి యెడలేని-నాట్యంబున్
దిగంబారె-బలమెల్ల నేటోర్తుము ౨
గతులొప్ప యెవిది యేమియే కాదశీ
వ్రతంబయ్యె యో-యెంతవర్తింతుము॥

9 బ్రహ్మ—రాగము-కాంబోజి రూపకతాళము.

ఇది నాకుదర మే-తరుణీ
ఇంతటి-కార్యము-సాధ్యమెరమణీ॥
చింతగనను-నింతయడుగ-స్వాంతమునకు
చింతగనను-నింతయడుగ-స్వాంతమునకు
చింతగదా-తలపఁగ-కాంతరో-యింతటి
వంతల-జింతిలి-యెంతకాల మింతదాళ సంతోషమా॥

అనుబంధములు.

10 అప్సరసలు—శామకల్యాణి ఆదితాళము.

మాకు-వారనిముదమలరారెను
చేకొనిసరసము-లాడుదము॥ ॥పల్లవి॥
విలాస-ములా యె-బలా మ-నలాగిది॥
తరుణులకిదెయీా-వెరవునమదిలో
తెరసినముదమిం-పరయఁగఁగదిరేక॥
సురు-చిర-విధమున-గర-మరు-దగుగద॥మాకు॥ ౧
విలసితగతిమా-కలరెనుదగ-నేఁడలవిగనిన
సొం-పలరెనుగదనే-భళి-భళి
విధమున-సలలిత-గతినిటు॥మాకు॥ ౨

11 రాగము-కేదార. ఆదితాళము.

రుక్మి—వాగవేణిరమణీ-తరుణీనసుదగన వే-మనుపవెయిటు ॥పల్లవి॥
మోహి—భూమిపాలతికా-తగునే-పురుషులమనుచుం-
బలుకఁగనిటు ॥పల్లవి॥
రుక్మి—నీ-పీకరణిందయఁగనవే వేకరికోరిననసునీ
నాకులపెట్టఁగఁదరుణీ-భీకరమదనుని-దాళనుసఖి॥ ౧
మోహి—భూ-మీావరచూడవలదె నే-దేవలతాంగినిగానా
నావిధమంతయుఁగన కే-యీావగనీమదిఁదలఁపోయవె॥ ౧
రుక్మి—లేమనీవెల-లేనిరూపము-నామనంబున-నిల్చెగా
ప్రేమతో-విన్నపం-బెన్ను చు-కాముబారిదొలంగఁగా॥ ౨
మోహి—ధారుణీధవనీకుఁ-జెల్లునే-తారతమ్యము చూడక
వారకీ-దారిదే-వాంగనల-గోరుసరసతధర్మమె॥ ౨

12 రాగము-హిందుస్తాని జంజాటి ఏకతాళము.

రుక్మి—వరసరోజనయనా-మరాళి సుందరగమనా
ఇదిక రాళగతితలపఁగదే॥ ॥పల్లవి॥

అనుబంధములు.

మోహి—వర-ధరాధిరమణా-సరోజరిపుసమవదనా
నిను-వరింపఁగల-దడయుఁగదె॥ ॥పల్లవి॥
రుక్మా—కడుఁ-గృపాపరతమన్నింపవే-వర-జపాకు
సుమసామ్యాధరా-నాపైనఁగోపము-మానవుకామినీ॥ ॥
మోహి—నామనోరమణయిటుతడయక-గను-వినోదమని
మదిఁగనక-జానార-నీనారిగా-నెంచినిల్వవే॥ ॥

13 కోమల—చక్రవాకము త్రిపుటతాళము.

మనసునదయలేక-వనజాక్షి యిట్లుచేసె నేఁడు
మనుజేశుఁగొన్నదయ్యో-ఘనపాపకర్యమాయెఁగాదె ॥పల్లవి॥
అరుదారనిట్టిరీతి-ధరలోననెందునైన-విన్నారమె
తరళాక్షిపైన నేఁడు-దయఁజూపనో కనీకుకాంతామణి ॥

14 సంధ్యా—రాగము-ధన్యాసి ఆదితాళము.

పరికింపరే-విరిబోణులారా
ధరణీశవరుని-నిరసింపనౌనె
తరళాక్షులారా-తరమౌనె-విభుఁగలఁపఁగ॥ ॥పల్లవి॥
మననాథుఁడింత-మదినొచ్చె నేని
వనజాక్షులారా-తనువున్న నేమిఫలము॥ ॥

15 రాగము-కాంభోజి ఏకతాళము.

సంధ్యా—మోహినీసతీ-మోదంబగునీచరితకు॥ ॥పల్లవి॥
మోహి—మానినీమణీ-నానేరము-కరుణింపవే॥ ॥పల్లవి॥
సంధ్యా—నీ-కరుణా-లో-కమునక-మా-కొదువల్
పోకార్చితిగదకామిని॥మోహిని॥ ॥
మోహి—భామినిరో-నీ-మహిమల్ నా-మదిలో
నేమంచునుకొనియాడుదు॥మానిని॥ ॥

అనుబంధములు.

సంధ్యా—ఎంతో-దయగలుణ్-కాంతా-మమునుపణ్
వింతో-ఘనగతిగా-సంతోషము మదిలోఁ జెందితిమిట్టు॥ ౨

మోహి—బాలా-నీమహిమల్-చాలా-ఘనములుగా
ఏలా-ననుబొగడణ్-మేలా-పలుకఁగనీవిధమున॥ ౨

సంధ్యా—సారసదళసమనయనా-రజనిపవదనా
బిసరుహనేత్రా-యసమముగాదే యసువులఁ-బెంపణ్
నీదయనిట్టు॥ మోహినీ॥ ౩

మోహి—కామినినదయఁగనుమా-మనవినివినుమా
ఘనమగునేరం-బొనరెను నాకుణ్-గొనకొని వేఁడణ్-
వచ్చితినిట్టు॥ ౩

16 మోహి—రాగము-పీలు ఏకతాళము.

భూరమణా-రతిగోరుదాన॥ ॥పల్లవి॥
వాడిశరమ్ముల-పంచన నేయుచున్నాఁడు
బ్రదుకఁగా-నీఁడుమారుఁడు॥ ౧

17 రాగము-కాంభోజి ఏకతాళము.

రుక్మా—మానగఁజాలుదు నే-నాగవేణీ
కానకవిమలై-కాదశివ్రతము॥ ॥పల్లవి॥

మోహి—తాళఁగఁజాలుదు నే-ప్రాణనాథా
చాలు నేకాదశి-యేలుమురమణా॥ ॥పల్లవి॥

రుక్మా—కీడును మేలును-జూడక యీలాగున
వేఁడఁగనీకును-బాడియెరమణీ

మోహి—మంచియొ చెడ్డయొ-మించెను మోహము
ఎంచివదలఁగా-వంచనగాదె॥

16 రాగము-జంజూటి తాళము.

మోహి—కుమారా-యిదేలయీ చరిత
చూడవే-చూడవే-ప్రహ్లాదగుణ్. ॥పల్లవి॥

అనుబంధములు.

ధర్మా—అసారం_బిదెంతయీతనువు-తల్లిరో
తల్లిరో-తల్లిరో-అసత్యమగుగా-అసత్యమేకలుగుగా ॥పల్లవి॥

మోహి—ప్రాణంబులనీ-పగిదింబాయ
నానందంబగునోకో_కుమారా॥

రుక్మా—శ్రీహరివాసర-సిద్ధితలంపనీ
దేహంబెక్కువయో-యసారం॥కుమారా॥

మోహి—ఏకాదశియన-యెంతటిదయ్యా
పోకార్పంగనసువుల్-కుమారా॥

19 ధర్మ—రాగము-జోగిసావేరి ఆది తాళము.
ఈమాటడంగంచగునే-జననిరో
భూమిధర్మములువలదే-కడుప్రేమ
నించుచునుగనుమా॥ ॥పల్లవి॥
ఈకాయంబది యెంత-జననిరో
హితవుచూచికనుమా-నాకు
నీ-స్మృతియేభాగ్యమా ౧
ఘనమగుపుణ్యముగలుగుగా
జనకుని-కిన్నృతముతొలంగంజేయగా
తనువునుగణనము సేయగా॥

20 ధర్మ—రాగము-ఆనందభైరవి ఏక తాళము.
హరినారాయణ-మాధవశౌరి
సురనాథాదర-చక్రిమురారీ॥ ॥పల్లవి॥
గరుడాంచితబహురమ్యతురంగా ౧
పరిపాలిత-సారంగమురారీ॥

21 లక్ష్మి—రాగము-కమాజు ఆది తాళము.
అళికుంతాలక-మెచ్చితిగా॥ ॥పల్లవి॥
భళి-భళియనరె-సంధ్యావళీధరణి॥ ॥అను॥
నీమగని-నేమమును-ప్రేమగని-ధీమతము
వేమారుమెచ్చితి-భామామణిరో॥ ౧
ధారుణిని-నీరమణు-ధీరమతి-నారయుచు
ప్రేమమునించితి-భామామణిరో॥ ౨

మంగళం. రాగం—చక్రవాకం ఆదితాళము.

శ్రీవరా మునివినుతా శ్రితపరిపాలన నిగమగోళా
దేవానందనా ధీరవినుత మంగళం
నీ అనుపమకరుణనుసే వినుతిసలుపంగలేనా
యినశశివరనయనా ఘనా శ్రితాసనాతనా
జనార్దనా ఘనారినిచయ వినాశనా
శ్రీలోల మముకరుణను పాలింపు తగమనువులనాలించి
సుఖవనధిని దేలించి మించి రామకృష్ణ పాలా
మంగళమగు ॥శ్రీవరా మునివినుతా॥

శ్రీ కృష్ణార్పణమస్తు.



*Printed at THE BHUVANESWARI PRESS, Bellary.*